

**The Tub (1886)**

The them of women washing occupied Degas throughout the 1880s. His intention was to show human animal preoccupied with herself, as if yo were looking at her through a keyhole.'

# మిసిమి

***"All that we are is the product of what we have thought," is "We are what we think."* – Dammapada.**


సంపుటి 6 | ఆగష్టు 1994 | సంచిక 61

సంపాదకుడు: రవీంద్రనాథ్ ఆలపాటి


## విషయసూచిక




విడిప్రతి రూ. 10/- వార్షిక చందా రూ. 60/-

చిత్రకారుడు

చేమకూర సత్యన్నారాయణ

# జ్యోతి

..గాంధీ సంచిక....

1948



ఎడిటర్

రవీంద్రనాథ్

# రేపటి జనసంఖ్య

## (1948 జ్యోతి నుండి)

– నారాయణరావు



ఏదేశంయొక్క ఐశ్వర్యంఐనా దాని మనుష్యసంపత్తిపై ఆధారపడి వుంటుంది. దేశంలో దానికి కావలసినన్ని ముడిపదార్థాలు, శక్తి (విద్యుచ్ఛక్తి) అనుకూలపరిస్థితులు విరివిగావున్నా, దాని ప్రజలు అజ్ఞానంగాను, బలహీనంగాను వుంటే అదే అనాథస్థితిలో ఉండక తప్పదు. దేశాభ్యుదయానికి దానిప్రజలే ఆయువుపట్టు. జనసంఖ్య తక్కువగా వున్న దేశాలు ఆర్థికంగా, పచ్చగా వుంటాయి. అట్లే జనసంఖ్య హెచ్చుగా వున్న దేశాలు చాలా హీనస్థితిలో వుంటాయి. జనసంఖ్యకు తగ్గట్టు దాని పరిశ్రమలు చక్కగా అభివృద్ధిపొంది వుండాలి. దేశానికి కావలసినది బలీయమైన, జ్ఞానవంతమైన జన సంఖ్య - మనదేశంలో కావలసినదానికంటె ఎక్కువ ప్రజలున్నారు. కాని వారిలో యెక్కువమంది అజ్ఞానులు-బలహీనులు, తినటానికి సరిగా తిండిలేనిబీదలు - వీరిసంఖ్య దేశానికి లాభదాయకంకాదు. ఆరోగ్యవంతులైన, తెలివిగల మనుష్యసంపత్తే మనకు కావలసింది - మనదేశంలో జనసంఖ్య విపరీతంగా పెరిగిపోతూంది. ఇప్పటికే యెక్కువ అవటంవల్ల మనలో ఎందరికో తినటానికి తిండిలేక మలమల మాడిపోవాల్సివస్తోంది. యీ జనసంఖ్య ఇంకా హెచ్చుతే యేమవుతుంది? మన దేశంలో ఎక్కువసంఖ్యకు కారణమేమిటి?

### సంతానానికి మనదేశం కల్పవృక్షం వంటిది.

సంతానం-కర్మ-దేవుని మహత్యం అంటారు మనపెద్దలు. నిజంగా సంతానం దేవుని మహత్యమేనా? 'మీకు ఏమీ తెలియదు. సంతానానికి మనం యేమిచేయగలం? మనచేతిలో ఏంవుంది? పిల్లలుకావాలి అనేవాళ్ళకు పిల్లలు లేకపోవటం ఏమిటి? బీదవాళ్ళకు ఇంత సంతానం ఏమిటి?' అంటారు మనపెద్దలు.

''వాళ్ల అదృష్టం-వాళ్లకర్మకి మనం కర్తలమా? వాళ్లు ఎందుకు పుట్టారో ఏ గొప్పయింటిలోనో పుట్టరాదూ? ఇదంతా ఆ జగన్నాటక సూత్రధారుడి మహిమ... నోరిచ్చినవాడే ఆహారమిస్తాడు'' అంటారు మనపెద్దలు.

చెట్టుకు వేలకొలది విత్తనాలిచ్చేడు, చేపకి వేలకొలది గుడ్లిచ్చాడు, పందికి-పది, పదిహేను పిల్లల్నిచ్చేడు. అటువంటి ఉదార పురుషుడు పిల్లలుకావాలోయ్ అనేవాళ్లకి పిల్లల్నివ్వకపోవటం

యేమిటి? వాడిబొంద, గొడ్డయి పోవటం ఏమిటి వట్టి తెలివితక్కువ గాక- ఇక బీదవాళ్లకు ఇందరు పిల్లలేమిటంటే...

మనిషియై పుట్టటమెందుకు సుఖించటానికేనా? ఆ సుఖం మనకెలావస్తుంది. సుఖించాలి అంటే మన ఇంద్రియాల్ని తృప్తి పరచాలి-బీదవాళ్లు తమ ఇంద్రియాల్ని తృప్తిపరుస్తారు? అందమైన చక్కని వస్తువులను, బొమ్మలను-దృశ్యాలను చూడాలి - వాటికై డబ్బు వెచ్చించాలి. డబ్బు బీదవాడి అందుబాటులో లేదు కనుక కళ్లతో సుఖాన్ని సంపాదించలేడు.

ఇక చెవులు : చక్కని మధుర సంగీతాన్ని చెవులు కాంక్షిస్తాయ్. దానికి డబ్బు కావాలాయె. ఇక ముక్కు : మంచి సువాసనలను వాంఛిస్తుంది - దానికీ డబ్బు? ఇక నాలుక : మంచి రుచికరమైన ఆహారం కావాలాయె - దానికీ సొమ్ము? ఇక చర్మం : మెత్తనివి, మృదువైనవి, పక్కలూ దుస్తులూ కావాలి - వాటికైనా డబ్బే?

బీదవాడు రోజుకి-రూపాయి కూలి తెచ్చుకొనేటప్పుడు - పై భోగాలెట్లా వస్తాయ్? వాడు సుఖించాలి అంటే ఆరవ యింద్రియం (కామం) కంటే వేరు మార్గంలేదు. వానికి ఎప్పుడు ఏ క్షణమందు మనస్సు కలుగుతే, అప్పుడు తన పశుకామాన్ని తీర్చుకొని ఆనందిస్తాడు. గత్యంతరంలేక వొప్పుకునే బానిస భార్య-అందుకే వాడికి కావలసినంతమంది పిల్లలు!! మనదేశంలో జనసంఖ్య ఎంత? అందులో బీదవారెందరు? వాళ్లందరు సుఖించే మార్గం? - అది కామం... అందుకే మనదేశంలో ఇంత ఎక్కువ జనసంఖ్య.

దినదినానికి యెక్కువవుతున్న యీ జనసంఖ్య మనకి ఆర్థికంగా చాలా ముప్పు తెస్తుంది. మనదేశంలో 100కి 75మంది హిందువులు - (ఇప్పుడు 100కి 85మంది హిందువులు). హిందూమతం ప్రకారం గృహస్థుధర్మం అన్నిధర్మాలకంటే గొప్పది.

హిందూధర్మ ప్రకారం పిల్లలు - అందులో (పాపం నాకు సరిగ్గా జ్ఞాపకం లేదు - యేదో పురాణం ప్రకారం సంతానహీనుడయిన ఋషిపుంగవునికి స్వర్గం లేకపోతే అష్టకష్టాలు పడి తుదకు పిట్ట అయి, పిల్లలు కన్నాట్ట) అందుకు ఏవో కొన్ని పురాణాలు కష్టపడి కల్పించారు పాపం, చూడండి - భారతంలో కుంతీదేవి (పతివ్రత) అదేదో మంత్రశక్తివల్ల నలుగురు కొడుకుల్ని కని తన భర్తకు స్వర్గం సంప్రాప్తింపచేసింది. ఈ పురాణాలు... ధర్మాలు మనకింతవరకూ... ఈ మృత్యువుతో పోట్లాడిస్తున్నాయ్.

''నారు పోసినవాడే నీరు పోస్తాడు'' అన్న పలుకులకిక ఈ నవ్యభారతంలో స్థానం వుండకూడదు.

వివాహాలు : మతధర్మంగా వివాహం చేసుకోవాలి - కాబట్టి వివాహం చేసుకోగలుగుతే మానరు. ఏజ్ ఆఫ్ కన్‌సెంట్ కమిటీ ప్రకారం 50% యువతులకి 15వ ఏడులోగా పెండ్లి ఐపోతూంది - వాళ్ల ఆరోగ్యం ఏమవుతుంది అనేప్రశ్న లేనేలేదు-యేమీ యెరుగని యువతులు తల్లులైతే, వారికి పుట్టే సంతానం ఎట్లా ఉంటుంది-వీళ్లే అనారోగ్యవంతులైతే వారి పిల్లల ఆరోగ్యం ఏమవుతుంది-? దీనివలనే యెక్కువ చావులు. ఇప్పటికీ బాల్యవివాహాలు జరుగుతున్నవంటే మనం సిగ్గుపడవలసి వొస్తుంది - కాని ఏం చేస్తున్నాం? కట్టుకోవటానికి మంచి గుడ్డలేక-తలకి నూనెలేక - కాలికి చెప్పుల్లేక - ఎందరు తండ్రులు తమ సౌఖ్యాల్ని తమబిడ్డలకై ఆహుతి చేస్తూన్నారు-కాని అప్పటికీ వారు తమబిడ్డలకు సౌఖ్యం చేకూర్చ గల్గుతున్నారా? అదే ఒక ఆరోగ్యమైన బిడ్డ అయివుంటే వారి జీవితాలెంత సుఖదాయకంగా సాగిపోయి ఉండేవో! ఇది బాగా ఆలోచించే పాశ్చాత్యులు అంటారు "You want a Baby

or a Baby - Austin" అప్పట్లో Baby Austin కారుండేది. అసలే సామాన్య మనుష్యుడు, విద్యాహీనుడు, అమాయకుడు, ఆపైని దైవభక్తి, పిచ్చిపిచ్చినమ్మకాలు గలవాడు. బీదవానికి పిల్లలుపుట్టడం నష్టం కాక లాభం. "A child is not a burden but an asset to a Poor man" పిల్లలు చిన్నప్పటినుండియే యేదో పనిచేసి కుటుంబానికి సహాయపడతారు. కాబట్టి బీదవాళ్ళకు యెక్కువ సంతానమైతేనే మంచిది అనేవాదన వుంది.

డార్విన్ "ఒక జంటయొక్క సంతానంతో ప్రపంచమంతా నిండిపోతూంది" అన్నాడు.

"ఒకజత మనుష్యుల సంతానం, 1750 సంవత్సరాల్లో ఇప్పటి ప్రపంచజనసంఖ్యను మించుతుంది."

మనదేశంలో యెక్కువ జనసంఖ్యను అరికట్టేందుకు మనం ప్రయత్నించాలి. జనసంఖ్య యొక్క ప్రాముఖ్యత డాక్టర్ హట్టన్ యొక్క రిపోర్టునుబట్టి తెలుస్తుంది.

"Attention has already been drawn to the grave increase in the population of this Country. The actual figure of the increase is about 34 millions, a figure approaching equal with that of the total population of France and Italy".

ఒక్క 1921-1931 అనగా 10 సంవత్సరముల్లో పెరిగిన జనసంఖ్యయే (340 లక్షలు). ఫ్రాన్సు ఇటలీదేశాల యొక్క మొత్తము జనసంఖ్యకు సమీపించుచున్నది.

మనదేశం యుద్ధానికి పూర్వం బర్మా సయాం దేశాలనుండి ఆహారధాన్యాలు దిగుమతి చేసుకొనేది-అంటే మనదేశం, దానిప్రజకు సరిపోయే ఆహారం ఉత్పత్తి చేసుకోలేదు - యుద్ధానంతరం - మనంపడుతున్న అగచాట్లు , ఏదేశంలోనూ వుండవు.

కాబట్టి అన్నివిధాలా మనం చాలా చెడ్డపరిస్థితుల్లో ఉన్నాము. మన జనసంఖ్య యెక్కువ కాకుండా ఉన్నట్టయితే మనం ఇప్పుడనుభవిస్తూన్న గడ్డుదినాల్ని చూడకపోయేవాళ్ళం. భవిష్యత్తు జనసంఖ్య బలిష్ఠంగానూ, ఆరోగ్యంగానూ ఉండటమే మనం వాంఛించేది.

దానికి కావలసినవి-మనోనిగ్రహం. కామాన్ని వీలైనంతవరకూ అరికట్టటం.

సంతాననిరోధం-దీనికై ప్రభుత్వమే చెయిచేసుకోవాలి-మంచి ప్లానులతో సంతాననిరోధం ఏవిధంగా ఉపయోగించేదీ ఆలోచించాలి. దీనికై పల్లెల్లోను, పట్టణాలలోనూ, సినీమాద్వారా, మ్యాజిక్ లాంటర్న్స్ద్వారా మంచిప్రచారం ఇవ్వాలి-ప్రతిపట్టణంలోనూ, ఆసుపత్రులలోను దీనిని ఉచితంగాను, లేక తక్కువధరలకు, పంచిపెట్టుతూ వాటి నుపయోగించే మార్గాల్ని సామాన్యప్రజలకు నచ్చ జెప్పాలి.

ఫ్రాన్సు దేశం చేసిన తప్పును మనం తిరిగి చేయరాదు. మన సంతాన నిరోధం ఒక క్రమపద్ధతిలో పనిచేయాలి. మనదేశంలో డాక్టర్లకే దీన్నిగురించి ఎక్కువ తెలియనప్పుడు, మనదేశంలో 10 గ్రామాలలో తొమ్మిదింటికి డాక్టర్లే లేకపోయేటప్పుడు - ఇంకా ప్రజలకెట్లా తెలుస్తుంది? కాబట్టి దేశాభ్యుదయానికై తయారుచేసిన ప్రణాళికల్లో , సంతాననిరోధానికి స్థానం వుండాలి.

మనదేశ జనుల యొక్క కొనుగోలు శక్తి హెచ్చించాలి. అంటే దానికి సమంగా జనసంఖ్య పెరుగుదలను అరికట్టాలి. రెండవది చేయక ఎంతకష్టబడ్డా మనకష్టాలు నిష్ఫలమౌతాయి. యేం చేయాలన్నా మొట్టమొదట ప్రజలకు విద్య గరపాలి.

బూర్జువా పరిశోధకుడైన సోని ''ఇండియాలో పరిస్థితులను గురించి ఏమాత్రం తెలిసినవారైనా, మొత్తం జనాభాలో నాలుగింట - మూడవ వంతు నిత్యదరిద్రంలో మునిగివున్నారనీ, కనీస జీవితావసరాలకైనా వారికి తక్షణనివారణ అవసరమనీ... ఇండియాలో ఎల్లప్పుడూ కడుపు నిండీ నిండకుండా కాలం గడుపుతున్నారనీ అంగీకరిస్తారు'' అన్నాడు.

వివిధదేశాలలో పుట్టుకల సంఖ్య - ఇంగ్లాండు 17, ఫ్రాన్సు 18, జర్మనీ 17, హాలెండు 28, ఇండియా 33. పైదాన్నుండి మనదేశంలో ఎంత యెక్కువమంది ఏటా పుడుతున్నారో తెలుస్తుంది-

ఒక చదరపు మైలునకు జనసంఖ్య : న్యూజిలాండు 12, ఈజిప్టు 34, ఇండియా 246. పైదేశాలు వ్యవసాయంమీద ఆధారపడ్డ దేశాలుగాని వాటిజనసంఖ్య మనకంటే చాలతక్కువ.

పెద్దకుటుంబాలు, మనపెద్దలదృష్టిలో దేవుని అనుగ్రహ చిహ్నాలు - కాబట్టి సంతాన నిరోధానికి ముందు ఎన్నోకష్టాలు ఎదుర్కోవలసి వుంటుంది -

ఏదియెట్లున్నను, మన జనసంఖ్య పెరుగుదలని తగుమార్గంలో, తగుపరిస్థితుల్లో అరికట్టాలి - లేకపోతే? [

PUNCH, OR THE LONDON CHARIVARI




THE PUZZLED KANGAROO.

**I suppose it's what I wanted;**
**but I'm hanged if I know what I've got!'**

# యముడి ముందు చలం
## (1948 జ్యోతి నుండి)

– ''చలం''



చ - ఎవరు? ఎముడా?

య - అవును.

చ - ఉన్నావా? లేవనుకున్నాను.

య - అనుకోలేదు. అనుకున్నా ననుకున్నావు.

చ - అన్ని మతాలవాళ్లూ అందరూ ఇక్కడికి రావలసిందేనా?

య - యముడిలో నమ్మకం వున్నవాళ్లు .

చ - తక్కినవాళ్ళూ.

య - వాళ్ళ నమ్మకంప్రకారం.

చ - అసలు నమ్మకం లేకపోతే.

య - ఏమీలేదు. దేంట్లోనూ నమ్మకం లేనివాళ్ళకి.

చ - మరణం తరవాత జీవితంలోనే నమ్మకం లేకపోతే?

య - మరణంతోనే ఆఖరు.

చ - నాకూ నమ్మకం లేదే! చాలామందికి లేదు ఇప్పుడు.

య - లేదంటే చాలదు. నిజంగా, నిస్సందేహంగా లేకపోవాలి. లేనివాళ్ల జీవితమే వేరు. మృగాలకి లేదు. వాటికి మృత్యువుతోనే అంతం. మరణంతో నిజంగా అంతం అనుకునే మనిషికి, జీవితంపైన ఆపట్టు వుండనే వుండదు. ఆరాతలు, ఆవాదాలూ, ఆ ప్రేమలూ ద్వేషాలూ నిలిచి పనిచెయ్యవు. నువ్వు చెప్పేదే నిజమని నమ్మకం. అవన్నీ ఏమిటి? ఏదీ నిలవక ప్రతినిముషం బూడిదైపొయ్యే ప్రపంచంలో సత్యమనేది ఎక్కడవుంది?

చ - కాని మానవజాతి అభివృద్ధి, సత్యానికి కళ్లు తెరవగల...

య - ఏం, మానవజాతి? పదేళ్ల తరవాత ప్రపంచం వుంటుందని ఆ విశ్వాసమేమిటి? సత్యమేదో తెలుసుకుంటుందని ఆ ఆశ ఏమిటి?

చ - అట్లా అయితే యీ విశ్వాసాలేం లేకుండా స్వార్థంగా బతికేవాడికి ఇకలోకం లేదన్నమాట.

య - స్వార్థంగా బతికేవాడికి వుంది. వాడు దేనికో బతుకుతున్నాడుగనుక.

చ - మరి ఎవరికి లేదూ?

య - అంటే అందరికీ వుంది. కాని అనేక విధాలుగా వుంది.

చ - నాకు యముడు అనేవాడిలో ఎన్నడూ నమ్మకం లేదు.

య - అయితే యముడివా అని నన్నెందుకు అడిగావు? యముడని నన్నెందుకు అనుకున్నావు?
చ - అవునేమో అనుకున్నాను.
య - అందుకునే ఐనాను.
చ - అనుకోకపోతే?
య - యుముణ్ణి కాను
చ - అప్పుడు ఎవరు?
య - నువ్వెవరని అనుమానిస్తె వాణ్ణి.
చ - తరవాత?
య - తరువాత నువ్వేమని అనుకుంటున్నావో అది.
చ - ఏమి అనుకోటం లేదు.
య - అబద్ధమాడకు. (నవ్వుతున్నాడు) నేను చెప్పనా? నీకు స్వర్గమా, నరకమా? అనుకుంటున్నావు. అవునా?
చ - నాకు స్వర్గనరకాలలో నమ్మకంలేదు.
య - అదంతా సరేలే. అది భూలోకంలో పుస్తకాలలో, ఇక్కడనన్ను చూసి అనుకున్నావా లేదా?
చ - మరియముడు గనక తరువాత అంతేకదా నేను అనుకోవలసింది.
య - అవును అంతేకదా అదే నిజం.
చ - సరే, స్వర్గమా, నరకమా?
య - నేను యముణ్ణైనప్పుడు, నరకమేగా నీకు.
చ - నాకు నరకంలో ఎప్పుడూ నమ్మకం లేదు.
య - లేదు, కాని నీ ఊహలూ, రాతలూ, పనులూ, ప్రపంచంలో ఏ మార్పు తెస్తాయనుకున్నావో? ప్రపంచంలో వాడివేగానువ్వూను. నీలో అవి తెచ్చే ఫలితమే నరకం.
చ - స్వర్గం కాకూడదా?
య - కావచ్చు, కాని నరకాన్ని ఏరుకున్నావు.
చ - ఎప్పుడు?
య - ఇప్పుడే, అంటే నీ జీవితమంతా అన్నమాట.
చ - అంటే?
య - ఇప్పుడనేది-పూర్వం యెప్పుడూ అనేదాని పర్యవసానం -
ఏ కార్యానికయినా ఫలితం వుంటుంది అనే నమ్మకంవుంటే, మరిఫలితం వుండకుండా వుండదు. మిగిలిపోయిన ఫలితాలు అక్కడ అనుభవించాలి.
చ - ఆనమ్మకం లేకపోతే -
య - లేకపోతే స్వర్గంలేదు నరకం లేదు. కాని ఫలితం కలగదని పనులు చేసే వాళ్లెవరు?
చ - నేను యముడననీ, నరకమనీ ఎందుకు అనుకున్నానంటే, చిన్నప్పటి భయాలూ అలవాట్లువొదలక, అంతే కాని నమ్మకం వుండికాదు.
య - మరి ఏం విశ్వసించావు?
చ - నాకేం తెలీదన్నాను.
య - సరే, ఇప్పుడు నేర్చుకుంటావు.

చ - ఏం నేర్చుకుంటాను.
య - ఏం నేర్చుకోవాలని వుంటే అదే.
చ - ఏం లేదని.
య - అదే నేర్చుకుంటావు. నరకంలో.
చ - మరి ఈశిక్ష ఎందుకు?
య - నీ అవినీతి కార్యాల ఫలితంగా.
చ - అట్లారండి? నీతి అంటే ఏమిటి? అవినీతి అంటే ఏమిటి?
య - నీకు తెలుసా?
చ - నాకు తెలీదు. తెలుసునన్న వాళ్లతో వాదిస్తాను.
య - నీవాదనలు నాకు తెలుసు.
చ - నాపుస్తకాలు చదివారా?
య - నిన్ను చదువుతున్నానుగా ఇప్పుడు.
చ - నేను చాలాసార్లు మారాను.
య - అన్ని మార్పులతోటి స్పష్టంగా నిన్ను చదువుతున్నాను.
చ - మరి చెప్పండి నీతి అంటే ఏమిటో?
య - నువ్వేమంటే అదే.
చ - అయితే నాకు శిక్ష ఎందుకు?
య - నువ్వనే నీతికే నువ్వు విరుద్ధంగా చాలాసార్లు ప్రవర్తించావు గనక. కాదా?
చ - అవును. కాని, నాఆదర్శం చాలా ఉన్నతం.
య - కాని, నీ నీతికి నీ ఆదర్శానికి నువ్వు అపకారం చేసుకున్నావు. దానికి పరిశాంతి ఈ నరకం.
చ - అసలు ఏ ఆదర్శం లేకుండా. శాస్త్రాల్లోదీ పొరుగు వారనేదీ నీతిగా తీసుకుని బతికేవారికి నీతిగా వుండడం సులభం.
య - అవును
చ - మరి వాళ్ళకీ!
య - స్వర్గం.
చ - స్వర్గమా? ఎందుకు?
య - నీతిగా బతికారు గనక. వాళ్ళ మనసులో అవినీతి చేశామనే నేరభావం లేదుగనక.
చ - నేరభావం లేకపోతే చాలునన్నమాట, ఇక నేరమనేది లేదా?
య - అదేగా రాశావు ఇన్నాళ్ళూ. పాప పుణ్యాలు లేవనీ, మనసు కల్పించుకుంటోందనీ, ఎవరి అంతరాత్మ వారికి ధర్మకర్త అనీ.
చ - అంటే నరక స్వర్గాలకి మనసులే ఆధారమా?
య - అవును. అంతే. నువ్వు రాసిన మాటలే. కాని నీకు నమ్మకం లేదన్నమాట.
చ - మరి వీటిని నిర్ణయించే దేవుడు?
య - దేవుడూ అంతే. కావాలంటే ఉన్నాడు, అఖ్ఖర్లేకపోతే లేడు.
చ - మరి ఇదంతా నిర్ణయించేదెవరు?
య - నువ్వే.
చ - తక్కినవాళ్ళనీ.
య - వాళ్ళే.

చ - మరి నువ్వూ.
య - నువ్వు ఉన్నావంటే ఉన్నాను అని చెప్పానుకదూ!
చ - చాలా అన్యాయంగా వుంది వ్యవహారం.
య - ఏమిటి?
చ - లేనిదేవుడిలో స్వర్గం నమ్మితే స్వర్గమా?
య - ఆ.
చ - నేను చూసిన దొంగభక్తులకి, మూఢులకి, పురుగుల్లాంటి క్షుద్రులకి.
య - వాళ్ళకి అట్లాంటిస్వర్గమే - అంటే, వాళ్ళు కోరుకునేలాంటి స్వర్గం. వారు ఆరాధించే దేవుడు.
చ - విష్ణుభక్తులకి
య - వైకుంఠం.
చ - ఎంత బుద్ధిహీనుణ్ని. నేనూ ఓ దేవుణ్ణి నమ్మితే...
య - ఏం లాభం? నువ్వు నమ్మలేవు. అయినా ఇప్పుడైనా మించిపోయిందేమీ లేదు. గట్టిగా కోరుకుంటే వైకుంఠానికి వెళ్ళవొచ్చు. కాని త్వరలోనే నరకానికి పోవాలని కోరుకుంటావు.
చ - ఎందుకు?
య - భరించలేక నీస్వభావం అట్లాంటిది గనక.
చ - ఏం చేస్తారు వైకుంఠంలో?
య - ఏం చెయ్యాలని ఆ భక్తుల కోరుకుంటారో అదే.
చ - భజన! పిడి భజన.
య - అవే భరిస్తావా?
చ - వాళ్లూ.
య - (నవ్వుతో) అదేదో చాలా గొప్పపని అని మీ లోకంలో ప్రార్థిస్తారు. నీ సాన్నిధ్యంలో చేర్చుకో. ఇంకా మాకేమీ అవసరం లేదని? కాని అన్ని అవసరాలూ వుండనే వుంటాయి. వెడతారు వైకుంఠానికి. రాత్రింబగళ్లు భజనే! భజన.
చ - వాళ్లకి శాంతి అది.
య - అనుకుంటారు భజనలు, విష్ణుసాన్నిధ్యం శాంతినిస్తుందని. భేషజాలకి భక్తి కోరుకుంటారు. కాని దాంటో నిలవలేక యాతన పడతారు.
చ - నిజంగా భక్తిమాధుర్యం, కలవాళ్లో.
య - వాళ్లకి ఫరవాలేదు. కాని వాళ్లెందరున్నారు? చాలామంది కోరుకునే స్వర్గాలు అంతే, అసలు వాళ్లకి ఇక్కడ ఏం కావాలో తెలిసిన వాళ్లెంతమంది?
చ - మరి వాళ్లేమౌతారు!
య - అట్లా తెలీక వెతుక్కుంటో వుంటారు. అయోమయంగా-తెలుసుకున్నదాకా.
చ - మరి నరకంలో బాధలు పెడతారుకదా!
య - ఎవరన్నారు? నువ్వు కోరుకున్నవన్నీ నరకంలో ఉన్నాయి. అందుకని అక్కడికి వెడుతున్నావు. మేమేం బాధపెట్టము. ఆబాధలేవో నువ్వే పెట్టుకుంటావు.
చ - ఎందుకు పెట్టుకుంటాను?
య - భూలోకంలో ఎందుకు పెట్టుకున్నావు? అక్కడా అంతే.
చ - నాకు కావలసినవన్నీ ఇక్కడ వుంటాయిగా!

య - అదేబాధ. కావలసినవన్నీ ఉండేబాధ. పైగా అవి నిన్నొపట్టాన వదలవు. స్వర్గంలో భజనలుమల్లేనే తలుచుకో. నీ పుస్తకాలూ, నీ కలలూ...

చ - మరి ఇంక ఆ లోకానికీ, ఈ లోకానికీ వ్యత్యాసమేముందీ!

య - ప్రయత్నాలూ, ఆశలూ, ఫలించేలోకం ఇది. అంతే. ఆ లోకంలో మిగిలిపోయినవన్నీ.

చ - ఈ నరకకాలం అయింతరవాత ఏమౌతాను?

య - ఏం లేదు. కాని అనుకోకుండా వుండవు.

చ - అప్సరసతో తిరుగుతోవుండాలనుకుంటే...

య - అపుడెందుకు, ఇప్పుడూ తిరగగలవు, అట్లా కోరుకుంటే. కాని అక్కడంతా శాంతీ సుఖం అనుకోటంలోనే మనుషులు చేసే పొరబాటు. వాళ్ళమనసు వాళ్లతోటే వుంటుంది.

చ - చాలా అర్థం కాకుండావుంది.

య - అంతేలే. ఈ జన్మల్ని, ఎవరూ నీమీద రుద్దటంలేదు.

చ - మరి సత్యం, న్యాయం, పద్ధతీ, .అభివృద్ధీ...

య - అవన్నీ వున్నాయి. కాని నువ్వు అనుకునేట్టు సంకుచితంగా కాదు. విలువలున్నాయి. కాని అవి కనపడవు నీకు. స్వార్థంగా, క్రూరంగా, బతికేమనుషులకి జీవితంలోంచి ఏమొస్తుంది? ఇతరుల కన్నీళ్ళలో బాధపడేవాడికి, ఒక్క చిరునవ్వులోంచి వొచ్చేమాధుర్యం ఎవరెరుగుదురు? బైట ఏం జరుగుతోందని కాదు. వాటినించి నీలోపల ఏం జరుగుతోందనే దృష్టి నీకు కలిగిన రోజున సమన్వయం ఎక్కువగా కలుగుతుంది.

చ - మరి యీ జనన మరణాల్నించి తప్పించుకోవాలని చేసే సాధకులు - మూర్ఖులేనా?

య - వాళ్లకింకా జీవించాలని వుంది. నిజంగా అక్కర్లేకపోతే, జనన మరణాల్నించి తప్పించుకోడం ఒక్క నిమిషం పని. జీవితంలో తాము కల్పించుకున్న బాధల్ని తామే పడలేక, ఏదో ముక్తి కావాలనే ఏడుపు ఆ సాధన అంతా.

చ - మరి యీశ్వరుడు ఆనందమయుడు. ఆత్మ ఆనందస్వరూపం అంటారు. అదేమిటి?

య - దేనిమీదా ఆధారపడని ఆనందం కావాలనుకున్న నిమిషాన అదీ సిద్ధంగానే వుంది.

చ - మరి అందరూ ఆ ఆనందాన్ని ఎందుకు కోరుకోరు?

య - వాళ్లకి అక్కర్లేదు గనక!

చ - ఎందుకు అక్కర్లేదు?

య - నీకెందుకు అక్కర్లేదు?

చ - అక్కర్లేకేం? దొరక్కకాని.

య - దొరకడమేముంది? నువ్వు గట్టిగా ఇంకో దృష్టిలేకుండా వాంఛించాలి అంతే. నిజంగా యోచించుకో. 'ఆనందం' అనేప్పటికి నీమనసు ఏం వాంఛిస్తుంది? నీపుస్తకాలు తెప్పించనా? ఆ ఆనందమే పుష్కలంగా దొరుకుతుంది నీకిక్కడ! ఆరూపాన ఆనందం వొద్దని నువ్వు మొరపెట్టిందాకా.

చ - నా మొరని ఎవరు వింటారు?

య - నువ్వే?

చ - విని?

య - విని, ఇంకోవిధమైన ఆనందాన్ని కోరుకుంటావు?

చ - తరువాత.

య - అదిసిద్ధిస్తుంది. అంతే నిరంతరంగా, అంతే, ఒకటి కోరుకుంటావో, అది ఇవ్వలేదనీ,

ఇచ్చాడనీ, దేవుణ్ణి విధిని, లోకాన్ని, కర్మని తిడుతో బతుకుతారు. ఎవరు వాంఛించేది వాళ్లకి తటస్థించి తీరుతుంది. అంతకన్న కరుణగల విషయం ఆలోచించుకోగలవా? వెళ్లు. వాళ్లందరూ నీకోసం ఎదురుచూస్తున్నారు.

చ - ఎవరు?

య - నీ కథానాయికలు. నువ్వు వాంఛించి, ఊహించి కల్పించుకున్న ఆదర్శ వ్యక్తులు.

చ - అమ్మో?

య - (నవ్వుతో) చూశావా, నీ నరకం ఇక్కడే ప్రారంభమయింది.

చ - పోనీ, స్వర్గానికిపోనీరా.

య - నిరభ్యంతరంగా, కాని అక్కడ మునులూ, రాంభజనగాళ్లూ.

చ - ఆడవాళ్లూ.

య - రాజ్యలక్ష్మిలూ, కాంతం, హృదయేశ్వరులూ, సవితలూ వుంటారు.

చ - వొద్దులెండి, నరకానికే పోతాను.

య - నాకు తెలుసుగా! అంటే నీకు తెలుసుగా!

# British Conquest

Unfortunately, the impact of modern western thought came in the wake of the British conquest. It made some headway untill discontent and then hatred against the foreign political rule became the predominating passion of the educated classes. Then all western influence was decried as denationalising materialism to be opposed and rejected in favour of the spiritual genius of Indian culture. Speculative thought of any kind had been for centuries eclipsed by priestly bigotry, superstitious ritualism and practice of social injustice, such as the caste system, untouchability, etc., which passed as religion. In that atmosphere, the democratic simplicity of Christianity had a strong appeal not only for the victims of social injustice, but also for many liberal intellectuals.

A movement of religious reform and of revival of the spiritualist philosophy of India were the reaction to that process of the disintegration of an intellectually stagnant society. Return to the pristine purity of Vedic ritualism was the religious reform advocated. The orthodoxy of the reformers was more bigoted than the current variety. Such a reactionary movement being incapable of meeting the situation, it was reinforced by the modern prophets of India's spiritual mission, who sought to provide a philosophical sanction for a religious revivalism. It was discovered in the post-Buddhist scholastic theology, which had expounded Vedanta as the quintessence of the philosophical thought of ancient India.

M.N. ROY

# సాంఖ్య దర్శనం

**- రాంభట్ల కృష్ణమూర్తి**

తత్వశాస్త్రాలు మతవ్యతిరేకత నుంచి పుట్టాయంటారు మార్క్సిస్టు పండితులు. గ్రీకు తత్వశాస్త్రచరిత్రను సమీక్షిస్తూ వారు చేసిన నిర్ణయం ఇది. ఆ రోజుల్లో పురాణాలే మతంగా ఉండేవి. గ్రీకుల పురాణం హెసియడు. రోమన్ల పురాణం ఓవిడు. జర్మన్ ఉత్తర యూరోపీ యుల పురాణం వెడ్డా. క్రైస్తవమత వ్యాప్తికి ముందు ఆయా ప్రాంతాల్లో ఈ పురాణమతాలే వుండేవంటున్నారు. మన మతానికి కూడా పురాణాలే ఆధారం. మతాన్ని ఉత్తరాది వారు ధర్మం అంటారు. ధర్మశాస్త్రం చరిత్ర రాసిన మహామహోపాధ్యాయ కాణే ధర్మమూలాలు ఆరు అని వివరించాడు. అవి:

పురాణాలు, పూర్వమీమాంస, అర్థశాస్త్రం, ధర్మశాస్త్రాలు, వేదాలు, వేదాంగాలు. ఈ పట్టిక ప్రకారం ధర్మం అంటే మతం అని అర్థం చెప్పుకుంటే దానికి మూలం పురాణాలని తేలుతుంది. రెండోస్థానంలోవున్న పూర్వమీమాంస తత్వశాస్త్రం. ఈ తత్వశాస్త్రం మతమూలాల్లో ఒకటి అయితే మార్క్సిస్టు పండితుల నిర్ధారణ మనదేశానికి వర్తించదనిపి స్తుంది. ఉత్తరాది వారు మతాన్ని ధర్మం సంప్రదాయం అనిపిలిచినా మనం మాత్రం మతం అనే అంటున్నాం. ధర్మం అన్న మాటకు ఎన్ని అర్థాలున్నాయో మతం అన్నమాటక్కూడా అనేకార్థాలున్నాయి.

పూర్వం మనదేశాన తత్వశాస్త్రాలనే మతంగా వర్ణించేవారు. మీమాంసకులు, వేదాంతులు, కాణాదులు, సాంఖ్యులు, నైయాయికులు, హేతువాదులు, భూతవాదులు, యోగులు– ఇలాగ తత్వశాస్త్రాలనే మతాలుగా పరిగణించి మాట్లాడుతూ ఉండేవారు. శంకరుడు శైవ, వైష్ణవ, శాక్త, సౌర, గాణాపత్య, కాపాలిక మతాలను సంస్కరించాడు కనక ఆయనకు షణ్మత స్థాపనాచార్య అన్న బిరుదం వచ్చిందంటారు. ఇలా సంస్కరించిన వాటికి నిర్దిష్ట తత్వశాస్త్రాలు లేవు. కొన్నింటికి క్లిష్టమైన ఉపాసనా తంత్రాలు మతభేదాలు మాత్రం ఉన్నాయి.

శంకరుడు సంస్కరించిన ఆరుమతాల్నీ పక్షపాతం లేకుండా పూజిస్తారు శంకర అనుయా యులైన స్మార్తబ్రాహ్మణులు. వారి పూజను పంచాయతనం అంటారు. శైవ, వైష్ణవ, శాక్త, సౌర, గాణాపత్యాలు అయిదింటికీ గుర్తులుగా అయిదు చిన్నరాళ్లు. వీటిని పంచాయతనం అంటారు. ఈ రాళ్లను ఒక లోహ సంపుటంలో ఉంచి పూజచేస్తారు. ఆ లోహసంపుటం కపాలం. కనక శంకరుడు సంస్కరించిన ఆరు మతాలమీదా, తమకు సమదృష్టి వుందని నిరూపించుకుంటారు. తమిళులు కపాలానికి బదులు కౌమారం అంటారు. అయితే సంస్కరించతగ్గ రీతిగా అదేనాడూ లేదు.

మనదేశాన ఏది మతమో ఏది తత్వశాస్త్రమో ఏర్పరచడానికి వీల్లేకుండా ''తైదలు ఆవాల్లా'' కలిసిపోయాయి. అందువల్ల మతాలు తత్వశాస్త్రాల సంఖ్య ఇక్కడ వందల్లో కనిపిస్తుంది. ఇక్కడి తత్వశాస్త్రాలను వర్గీకరించాలంటే అందుకు ఇక్కడ పుట్టిన కొలమానాలు

పనిచేయవు. వాటివల్ల గందరగోళం ఇంకా ఎక్కువ అనడం తప్ప ఫలితం మాత్రం వుండదు. అందువల్ల పశ్చిమ దేశాల కొలమానాన్ని అనుసరించి తత్వశాస్త్రమౌలిక ప్రశ్న ప్రశ్న వేసుకోవాలి. ఆ ప్రశ్నకు జవాబు చెప్పుకుని దానిప్రకారం ఆ తత్వాన్ని పరిశీలించాలి. అప్పుడే విషయం తేటపడుతుంది.

అస్తిత్వానికీ చైతన్యానికీ గల సంబంధం ఏమిటి? ఇదీ తత్వశాస్త్రమౌలిక ప్రశ్న. అస్తిత్వం అంటే పదార్థం. చైతన్యం అంటే జ్ఞానం. ఈ రెండూ వున్నాయి. కనిపిస్తూనే వున్నాయి. ఇందులో యేది ఆదిలో వుంది? యేది తరవాత వచ్చింది? ఏది అగ్రిమం? యేది అనగ్రిమం? ఏది నేయం, యేది అనుయాయం. ఈ ప్రశ్నవేసుకుంటే వచ్చే జవాబును బట్టే ఆ తత్వం భౌతికవాదమా భావవాదమా అన్న సంగతి తేలుతుంది. భౌతికభావవాదాలు తాత్వికాలు. ఈశ్వరనిరీశ్వరవాదాలు మతపరమైనవి. మన తత్వశాస్త్రాలన్నింటిలోకీ సాంఖ్యం ఒక్కటే జగత్కారణం ప్రకృతి అని చెప్పింది. అందువల్ల ఈ తత్వం మీద ఆధునికులకు మక్కువ కలిగింది. అయితేనేమి తత్వాలలో సాంఖ్యం అన్న పేరు తప్ప మరేమీ మిగల్లేదు.

ఈ తత్వానికి సాంఖ్యం అన్న పేరు ఎందుకు వచ్చిందో తెలీదు. ఈ తత్వకర్త కపిలుడని పెద్దలంటారు. అతడెక్కడివాడో ఎప్పటివాడో తెలీదు. అతడిమీద రకరకాల కథలు పురాణాల్లో వున్నాయి. ఆసురి, పంచశిఖ, వోఢు, సనక సనందనులు కూడా సాంఖ్యనిర్మాత లుగా కనిపిస్తారు. ఇందులో సనకసనందనుల మీద కపిలుని కన్నా ఎక్కువ కథలున్నాయి. సాంఖ్యం అతి ప్రాచీనం అని అంతా ఒప్పుకుంటారు. ఎంత ప్రాచీనం అంటే బుద్ధునికన్నా ప్రాచీనం అంటారు. చరకసంహిత, మనుస్మృతి, మహాభారతం, అనేక పురాణాల్లో సాంఖ్య తత్వప్రస్తావనలు భావాలు కనిపిస్తాయి.

సాంఖ్యతత్వం మీద ఈశ్వరకృష్ణుని సాంఖ్యకారికలు, కపిలుని పేర సాంఖ్యసూత్రాలు ఇప్పుడు దొరుకుతున్నాయి. ఈశ్వరకృష్ణుడు క్రీస్తుశకం అయిదు వందల దరిదాపులవాడు. సూత్రకర్త కపిలుడు క్రీస్తుశకం పద్నాలుగువందల ప్రాంతం వాడు. ఈశ్వరకృష్ణుని కారికలు 72 అనుష్టుపు శ్లోకాలు. సాంఖ్యతత్వాన్ని మహాభారతం సనాతనతత్వం అంది. సాంఖ్యం మీద పాశ్చాత్య పండితులు చాలా ఆసక్తిచూపారు.

ఆది నుంచీ దేవుని తిరస్కరించిన తత్వం సాంఖ్యం ఒక్కటే. దేవుని తిరస్కరించింది కనక దానికి నిరీశ్వర సాంఖ్యం అన్న పేరు వచ్చింది. ఈ సాంఖ్య పద్ధతిని పుణికిపుచ్చుకుని దాని నెత్తిన దేవుని ఎక్కించింది యోగం. ఆ విధంగా అది కూడా తత్వశాస్త్ర హోదాను సంతరించుకుంది. ఒక్కదేవుని ఉనికి తప్ప సాంఖ్యంతో మరేలాంటి తాత్విక భేదమూ లేనందువల్ల యోగాన్ని సేశ్వర సాంఖ్యం అనికూడా అంటారు. యోగసూత్రకర్త పతంజలి అంటారు. పతంజలి వ్యాకరణ మహాభాష్యకర్తగా ప్రసిద్ధుడు. అతడూ యోగసూత్రకర్తా ఒకడేనని భారతీయ పండితుల నమ్మకం.

జగత్తు మూలకారణం ప్రకృతి. ప్రకృతినే ప్రధానం అన్నారు. తాత్వికంగా సాంఖ్యం ప్రధానవాదం. జగత్కారణం ప్రధానం అంటే పదార్థం అని నిరూపించడం కోసం సాంఖ్యులు అనుసరించిన పద్ధతి సత్కార్యవాదం. దీన్నే పరిణామవాదం అంటారు. తరవాతికాలం వారు కార్యకారణపద్ధతి అనీ హేతువాదం అనీ అన్నారు. జగత్తంతా పదార్థమయంగా కనిపిస్తున్నది. అంచాత ఈ జగత్కారణం కూడా పదార్థమే అయి తీరాలి. అంచాత ఆత్మకు పర్యాయపద

మయిన బ్రహ్మవాదాన్ని సాంఖ్యం తిరస్కరించింది. పరిణామవాదం నిరూపణకు ఈశ్వర కృష్ణుడు వ్యవసాయం నుంచీ పంటల నుంచీ అనేక ఉదాహరణలిచ్చాడు. ఇతర తత్వశాస్త్రాల ఉదాహరణలు 'ఘట, పటాల'ను దాటిపోలేదు. ఘటమంటే కుండ. పటం అంటే బట్ట.

సాంఖ్యకారికాకారుడు మాత్రమే వ్యవసాయం పంటలను ఉదాహరించాడు కనక ఈ తత్వం తొలి వ్యవసాయ సమాజంలో పుట్టి ఉండవచ్చుననిపిస్తోంది. మానవజాతి చరిత్రలో బర్బర మహాదశ ద్వితీయాంతరంలోనే వ్యవసాయం పశుపాలనా మొదలయ్యాయి. ఆర్యులు ఆదిలో పశుపాలన మొదలు పెట్టారు. ఇక్కడ ఆర్యులన్న మాటను భాషావాచకంగా మాత్రమే వాడుతున్నాను. అలాగే సెమెటిక్ భాషలు మాట్లాడేవారిని భాషావాచకంగా మ్లేచ్ఛులంటు న్నాను. ఆర్యులు ఆవులు ఎడ్లను పెంచితే మ్లేచ్ఛులు గొర్రెలు మేకలను పెంచారు. వారికి వ్యవసాయం పశుగ్రాసం వరకే తెలుసును.

ఆర్య మ్లేచ్ఛా భాషాకూటాలకు చెందని సుమేరులు, మ్లేచ్ఛులైన ఈజిప్టువారూ చరిత్రలో తొలి వ్యవసాయకులుగా ప్రసిద్ధి చెందారు. మెసపొటేమియాలో మ్లేచ్ఛ భాషలు మాట్లాడే అగదులు, అసురులు కూడా సుమేరుల వ్యవసాయ నాగరికతనే అనుసరించారు. భారతదేశాన సింధునాగరికతను నిర్మించిన వారు సుమేరు అసురులు అన్న ఒకవాదం ఉంది. బహుశా వారి నుంచే సాంఖ్యతత్వం మనదేశానికి వచ్చివుంటుంది.

ఈశ్వరకృష్ణుని మతానుసారం ప్రకృతి ఆదిలో అవ్యక్తంగా వుండేది. అవ్యక్తం నుంచి మహత్తు పుట్టింది. మహత్తు అంటేనే బుద్ధి అని ఒకవాదం, మహత్తు నుంచి బుద్ధి పుట్టిందని మరోవాదం. బుద్ధి నుంచి అహంకారం, అహంకారం నుంచి మనస్సు పుట్టాయి. మనస్సు నుంచి అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు కర్మేంద్రియాలు, అయిదు తన్మాత్రలు, అయిదు మహాభూతాలు పరిణామక్రమంలో వచ్చాయి. అహంకారానికి మనస్సు కన్నా ఉన్నతస్థానం కల్పించడం కొందరు ఆధునికులకు నచ్చలేదు. అహంకారం అంటే ''ఈగో'' ఇప్పుడు అనేక అపవాదాలకు లోనయింది.

అహంకారం అన్నది వేదాంతుల తురుపుముక్క. అహమే బ్రహ్మ. బ్రహ్మే అహం. వేదాంతులది చేతనకారణ వాదం. అంటే బ్రహ్మ కారణవాదం. బ్రహ్మ అంటే అహం అని తెలుసుకున్నాం కదా? ఈ వాదం ఈశ్వరకృష్ణుని మనసున హత్తుకున్నట్లుంది. అంచాత బ్రహ్మరూపి అయిన అహంకారాన్ని మనస్సుకన్నా పైకెక్కించి వుంటాడు. మహత్తు నుంచి బుద్ధి పుట్టిందనుకుంటే బుద్ధి అహంకారం మనస్సు మూడే అవుతాయి. వీటితో మొత్తం తత్వాల సంఖ్య ఇరవైమూడే అవుతుంది. అంచాత మహత్తును కూడా ఒక జ్ఞానరూపంగా గ్రహించవలసి వస్తుంది.

సాంఖ్యం చతుర్వింశత్తత్వాత్మికం– ''మనోబుద్ధి చిత్తాహంకారత్వక్చక్షు శ్రోత్రజిహ్వా ఘ్రాణ వాక్పాణి పాదపాయూపస్థశబ్దస్పర్శ రూపరస గంధాకాశవాయ్వగ్ని సలిల భూమ్యాంతే శుద్ధ తత్వైశ్చ'' అని సూత్రరూపాన వుంది. బహుశా ఇది సాంఖ్య సూత్రాల లెక్క అయి వుండవచ్చునని ఆది నాలుగు తత్వాలూ పురుష రూపం అంటే జ్ఞాన దశలు అయివుంటా యని కొందరు పండితులన్నారు. పందొమ్మిదో శతాబ్దం నాటి విజ్ఞానశాస్త్రాన్ననుసరించి సాంఖ్యకారికలన్నింటికీ శాస్త్రీయార్థాన్ని చెప్పడానికి కొంతమంది పండితులు యతించారు.

వేదాంతానికి ఆధారం బ్రహ్మసూత్రాలు. వీటి మీద శంకర, రామానుజ, మధ్వాచార్యులు ముగ్గురూ భాష్యాలు రాశారు. శైవమత ప్రచారకులు కూడా ఒక భాష్యం రాశారు. ఈ అన్నింటిలోకీ శంకర భాష్యానికి ఎక్కువ ప్రచారం వుంది. చేతనకారణ వాదమయిన బ్రహ్మను ఆయన వాడినంత విరళంగా మిగతావారు వాడలేకపోయారు. బ్రహ్మసూత్రాలు ప్రధానంగా రెండుతత్వాలను తీవ్రంగా ఖండించాయి. ఒకటి పూర్వమీమాంస. రెండు సాంఖ్యం. సాంఖ్యతత్వాన్ని ఖండించడం కోసం బ్రహ్మసూత్రాల్లో అరవైసూత్రాలను వాడవలసి వచ్చింది.

పూర్వమీమాంసాతత్వం వేదాలకు అతి సన్నిహితమైనది. కాగా అది నిరీశ్వరవాదంలో ఉగ్రవాది. మామూలు ఉగ్రవాది కాదు. చండఉగ్రవాది. అయినా అంత చండంగానూ వేదాలను సమర్థిస్తుంది. సాంఖ్యం కూడా నిరీశ్వరవాది. అంతేకాదు అచేతనకారణ వాది కూడా. అందువల్ల శంకరుడు సాంఖ్యాన్ని ''ప్రధానమల్లుని''గా భావించాడు ప్రధానమల్లుడిని చిత్తుచేస్తే చిల్లర మల్లులంతా సలాంకొట్టి పలాయనం చిత్తగిస్తారు. దీన్ని పండితులు ''ప్రధాన మల్ల న్యాయం'' అంటారు. బ్రహ్మవాదాన్ని సమర్థించుకునే వారంతా ముందు సాంఖ్యాన్ని తిరస్కరించాలి. అందుకు వారి నిత్యస్మరణం ఇది:—

''మనోబుద్ధహంకార చిత్తానినాహం నచశ్రోత్రజి హ్వేనచాఘ్రాణనేత్రే నచవ్యోమ భూమి ర్నతేజోనవాయూచిదానందరూపశ్శివోహం శివోహం'' ఇలా సాంఖ్యంలో ఏ తత్వాన్నీ కానుకాను అని నిత్యం స్మరించుకుంటే తప్ప ఆసాంఖ్యం బ్రహ్మవాదుల్ని మింగేస్తుందని వేదాంతుల భయం అయివుంటుంది. సాంఖ్యంలో ఆధునికులను తికమక పెట్టే అంశం మరొకటుంది. అది ''ప్రకృతి ఏకం పురుషో బహవః'' అన్న సూత్రం. వేదాంతులు ప్రకృతిని మాయ అన్నారు. పురుషుడు ఒకడే కాని మాయ అనంతరూపాల్లో వుంటుంది. అలాంటిది సాంఖ్యం పురుషో బహవః అనడం పండితుల తికమకకు కారణం అయింది.

ఈశ్వరవాదులు జగత్‌సృష్టి కర్త దేవుడు అని ఘోషిస్తూవుంటే సాంఖ్యం పురుషుడు ఉదాసీనుడంటుంది. ప్రకృతి క్రియాశీలం అంటుంది. క్రీస్తుపూర్వం అయిదారు సహస్రాబ్దాల నాడు సుమేరుతత్వంలో ''అంకి'' అన్న మాటుంది. సుమేరు భాషలో 'అం' అంటే ఆకాశం. 'కి' అంటే భూమి. అంకి అంటే భూమ్యాకాశాలు. వేదం ఇదే తత్వాన్ని 'ద్యావాపృథివీ' అంది. వేదోక్త వివాహాల్లో వరుడు 'ద్యౌరహం పృథివీత్వం' అని వధువుతో అంటాడు. అంటే నేను ఆకాశాన్ని నీవు భూమివి అని అర్థం. ''బ్రహ్మ విష్ణు మహేశ్వ ముగ్గురు అన్నదమ్ము లంటా యీ భూదేవి, ఆకాశం వారికి తల్లిదండ్రులంటా'' అంటుంది తత్వం.

యాగంటి లక్ష్మయ్యగారు ఈ తత్వకర్త. భూమిని ''మాతర్'' అంటారు రోమన్లు. ఆ పదమే ఇంగ్లీషులో ''మేటర్'' అయింది. ఆ మాటను నేటికీ పదార్థానికి వాడుతూనే వున్నారు. అసలు సాంఖ్య తత్వకర్త కపిలమహర్షి కాడని ''కపిలా'' అనే స్త్రీ అనీ అనుమానం వెలిబుచ్చాడు ప్రముఖ తత్వశాస్త్ర పండితుడు దేవీప్రసాద ఛటోపాధ్యాయ. కపిల భర్త పేరు ఆసురి. వారి కుమారుడు పంచశిఖుడు. ఇతడు సాంఖ్యంలో షష్టిక తంత్రం అన్న గ్రంథం రాశాడంటాడాయన. సాంఖ్యం అన్నమాట సంఖ్య అంకె అన్నమాట నుంచి వచ్చింది.

దశాంశమానం భారతీయులు కనిపెట్టారంటారు. సుమేరులది షష్ట్యంశమానం దాన్ని ఇంగ్లీషులో SEXAGESIMAL SYSTEM అంటారు. ఇప్పటికీ కాలగణనంలో ప్రపంచం

## Crime Anatamy

Now comes the most starting discovery yet. According to a recent report in *Science*, researchers have found discrete locations in the brain of an intricate system that serves, among other things, as the human moral compass. Largely in the prefrontal cortex, it is where reason is applied to complex social situations, where our personal scales of justice do their weighing. It may come as a shock that this highest, most spiritual faculty is just as identifiable and in some ways as physically vulnerable as, say, a knee joint. But vulnerable it is. One's moral fiber can literally snap. For it was just such a ruputre taht led the researchers to their discovery.

# శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి

– బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

హైదరాబాదులో జరిగిన ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలకు మారిషస్ దీవుల నుంచి ఒక తెలుగు ప్రతినిధి వచ్చాడు – పైడిరాజుగారు! ఆయనకు తెలుగు సాహిత్య మంటే వల్లమాలిన అభిమానం. ముఖ్యంగా భక్తి సాహిత్యం అంటే! మారిషస్ దీవుల నుంచి సభలకు బయలుదేరే ముందు ఆయన కృష్ణశాస్త్రి గారి 'మహతి' అనే కావ్యం చదివారు. దానిలో—

''నా నోట నీ మాట గానమయ్యే వేళ
నా గుండె నీ వుండి మ్రోయింపవా వీణ?
రాగ మెరుగని వీణ – రక్తి నెరుగుని వీణ
తీగపై నీ చేయి తీయకే గడియేని!''

''నా కేల నొక జోలె
నాలో నమృత వీణ
ఉంచి నను లెమ్మందువా?
దేవా!
ఊరకే పొమ్మందువా?''

''అవని అంతా పెద్ద అక్షయ పాత్ర
అఖిలేశు హస్తమే అన్నపూర్ణమ్మ!
గుడిసెలో, గుడులలో కునుకు బిచ్చగాడు
వాడ వాడల తిరుగువాడె ఇచ్చువాడు!''

ఇలాంటి పాట లెన్నో ఆయనను ముగ్ధుణ్ణి చేశాయి. ''సూరదాసు, మీరాబాయి లాంటి భక్త కవి, త్యాగరాజును తలదన్నిన మహాభక్తుడు తెలుగుదేశంలో ఉద్భవించాడు. ఇండియా వెళ్ళగానే ముందుగా ఈయన దర్శనం చేసుకోవాలి! బహుశః ఆయన ఇప్పుడు ఏ కృష్ణదాసు అనే పేరుతోనో ఒక ఆశ్రమం స్థాపించుకొని, పెద్దపెద్ద నామాలతో నెరిసిన వెండి గడ్డంతో, కావి రంగు అంగరఖాతో ఒక ఏకతార చేతపుచ్చుకుని భగవన్నామ సంకీర్తనం చేస్తూ నిత్యం తన ఆశ్రమం సందర్శించే భక్తుల నందరినీ తరింపచేస్తూ ఉండి ఉంటారు. వీలయితే ఆయన ఆశ్రమంలో ప్రశాంతంగా రెండు రోజులు గడిపి రావాలి'' అని ఎన్నెన్నో ఆలోచించుకుని ఆయన ఇండియా వచ్చాడు. ''కృష్ణశాస్త్రి గారి ఆశ్రమం అడ్రస్సు కాస్త చెబుతారా?'' అని అడిగాడు ఆయన నన్ను. నేను తెల్లబోయి, ''కృష్ణశాస్త్రిగారి ఆశ్రమ మేమిటి? వారు కూడా ఈ సభలకు వచ్చారు. అరుగో– ఆయనే కృష్ణశాస్త్రిగా రంటే!'' అని దూరంగా ఉన్న శాస్త్రిగారిని చూపించాను. తెల్లని గ్లాస్కో మల్లుపంచె గూడకట్టూ, గ్లాస్కో లాల్చీ వేసుకుని చేతిలోని నోటు బుక్కులో ఏదో రాసి ప్రక్కాయనకి చూపించి కొంటెగా నవ్వుతున్న కృష్ణశాస్త్రిగారిని చూసి అతడు నమ్మలేకపోయాడు. 'ఈయనేనా ఆ భక్త కవి?' అని నిర్ఘాంతపోయాడు.

ఆ ప్రపంచ తెలుగు మహాసభలకే కౌలాలంపూరు నుంచి మరో తెలుగు ప్రతినిధి వచ్చాడు. నూకరాజుగారు! ఇండియా రాబోయే ముందు ఆయనకు కృష్ణశాస్త్రిగారి కృతులలో 'కృష్ణ పక్షం, ఊర్వశి–ప్రవాసం'' సంపుటం దొరికింది. దానిలో –

''నన్ను గని యేరు జాలి చెందంగ వలదు
ఎవ్వరని యెంతురో నన్ను? ఏ ననంత
శోక భీకర లోక తిమిరైక పతిని''

''హృదయ వనజాత సుమ
మృదు మనోహర దళము
లదయతను ద్రుంచినారే!
పెంధూళి
చిదిమి వెదజల్లినారే!''

''ఏను మరణించుచున్నాను, ఇటు నశించు
నా కొరకు చెమ్మగిల నయనమ్ము లేదు;
నా మరణశయ్య పరచుకొన్నాను నేనె!
నేనె నాకు వీడ్కోలుపు విన్పించినాను!!''

ఇలాంటి నిరాశాభావ పూరితమైన ప్రణయ గీతాలు ఆయనను గాఢంగా పట్టుకున్నాయి. ''ప్రణయ కవిత్వంలో సుమిత్రానందన్ పంత్, మహాదేవీవర్మ వంటి హిందీ కవుల కంటె కూడా ఉన్నతమైన స్థాయినందుకున్నారు ఈ కృష్ణశాస్త్రిగారు. ఇండియా వెళ్లగానే ఈయనతో పరిచయం చేసుకోవాలి. ఎప్పుడో 1925లో ఈ నిరాశాగీతాలూ, భగ్నప్రణయ కవితా వ్రాసిన ఈ కవిలో వచ్చిన అనంతర పరిణామా లేమిటో తెలుసుకోవాలి. ఇప్పటికీ ఇంకా ఆయన ఏ మజ్నూలాగానో మాసిన గడ్డంతో చిరిగిన దుస్తులతో లోకానికి దూరంగా ఏకాంతవాసం చేస్తూనే ఉండి ఉంటారా?'' అని ఏవేవో ఊహించుకుంటూ ఇండియా వచ్చారు ఆ నూకరాజుగారు. ''దయచేసి కృష్ణశాస్త్రిగారిని గురించిన వివరాలు కాస్త చెబుతారా?'' అని ఆయనా నన్నే అడిగారు. ఆయనకూ నేనే ఆ సభల్లో దూరంగా కూచుని ఉన్న శాస్త్రిగారిని చూపించాను. అప్పుడే శ్రీ శాస్త్రిగారు తన నోట్‌బుక్‌లో ఏదో జోక్ వ్రాసి చుట్టూ ఉన్న వాళ్లంతా విరగబడినవ్వుతూ ఉంటే పెదిమెలు బిగబట్టి కళ్లలో చిత్రమైన మెరుపుతో వాళ్లవంక నిదానంగా చూస్తున్నారు. ఆ స్థితిలో కృష్ణశాస్త్రిగారిని చూసి నూకరాజుగారూ నమ్మలేకపోయాడు. ''ఈయనేనా ఆ నిరాశా ప్రవక్త?'' అని నివ్వెరపోయాడు.

మరికొంత సేపయ్యాక మరో అంతర్జాతీయ తెలుగు ప్రతినిధి వచ్చి నా భుజం తట్టాడు. ఆయన దక్షిణాఫ్రికా నుంచి వచ్చిన వాడు - వరహాలరాజుగారు! ఇండియా వచ్చే ముందు కృష్ణశాస్త్రిగారి కృతుల్లో ఆయనకు లభించిన రచన 'బహుకాల దర్శనం' - విశ్వోదయ ప్రచురణ. దానిలో– 'అవ్వ తిరునాళ్లలో తప్పిపోయింది'.. 'బూట్‌పాలిష్', 'ఇద్దరు సత్యవాదులు' లాంటి రచనలలోని లోకజ్ఞతా, సంఘ వాస్తవికతని దర్శించగల నిశిత దృష్టీ, లలిత హాస్యం ఆయనను పరవశుణ్ణి చేశాయి. ''ఇంత లోకజ్ఞుడైన వ్యక్తి రాజకీయాల్లో ప్రవేశిస్తే తేలిగ్గా ముఖ్యమంత్రి అయిపోవడం ఖాయం. బహుశః ఆయన రాజకీయాల్లో ప్రవేశించే ఉంటారు! ఆయన జనతాపార్టీనో, ఇందిరా కాంగ్రెస్సో తెలుసుకోవాలి!'' అనే కుతూహ

లంతో ఇండియా వచ్చాడు - దక్షిణాఫ్రికాలో ఒక ఫోటోరాజకీయ నాయకుడు అని చెప్పదగిన ఆ వరహాలరాజుగారు. ఆయనకీ 'కృష్ణశాస్త్రి గారు అదుగో అక్కడ ఉన్నారు' అని నేనే వేలుపెట్టి చూపించాను. ఆ సభ లేవీ తనకు పట్టనట్లు ఎదురుగా ఉన్న ఓ పచ్చని చెట్టుకేసి ఏకాగ్రంగా చూస్తూ ఒక బహిర్వర్తి (outsider) లా కూచుని ఉన్నారు శాస్త్రిగారు. ఆ క్షణంలో కృష్ణశాస్త్రిగారు తను అనుకున్నట్లు లేనందుకు వరహాలరాజుగారికి ఆశాభంగమే కలిగింది.

"కృష్ణశాస్త్రి గారి వ్యక్తిత్వంలో పైకి కనిపించే ఈ మూర్తిత్రయం వెనుక ఉన్న నిజమైన కృష్ణశాస్త్రిగారు ఎవరు? సృష్టి స్థితి లయ కారకులైన త్రిమూర్తులలాగా స్థూలంగా కనిపించినా అనాదీ, అనంతం ఆయన ఒక పరతత్త్వం ఉన్నట్లుగా శాస్త్రిగారి ఈ మూర్తిత్రయం వెనుక ప్రకాశించే ఒక పరమార్థం ఉండి ఉండాలి. అది ఏమిటి?" అని నేను గాఢంగా ఆలోచించాను. చివరికి ఆయన రచనలలోనే నా ప్రశ్నకు సమాధానం దొరికింది:

"నా వినాసమ్ము తొలుత గంధర్వలోక
మధుర సుషమా సుధాగాన మంజువాటి
ఏ నొక వియోగశాలిసీ హృదయరాగ
వేదనా రేఖను........."

"అవును - అచ్చంగా ఆయన ఒక వియోగ గీతికే! 'నిదుర వెన్నెలల' దారిలో ఈ అనంత విశ్వంలోకి దిగివచ్చాడు.

"అదియె మొదలే లేను సకల దిశాంతరాళ
మెల్లెడల నెందుకో పర్వులెత్తిపోవ!
.... .... .... .... .... .... ....
ఇది ముగియబోని ఏ యర్థ మెరుగరాని
వేసటే లేని వెర్రి అన్వేషణమ్ము!"

అలా ఆ అన్వేషణలోనే జీవితం అంతా గడిపి, చివరికి 'ఒక్క నిట్టూర్పు'లాగ, ఒక్క 'మౌన భాష్పకణం'లాగ, ఒక 'గాఢవాంఛ'లాగ ఈ లోకంనుంచి ఆయన నిష్క్రమించారు.

అవును - అదే నిజమైన కృష్ణశాస్త్రి గారు! 

## Crime Moral Judgement

And now, thanks to Phineas Gage, scientists will know where to search for that hole. It is surely where they will look when studying the brain donated to science-of serial killer John Wayne Gacy, executed last May in Illinois. Suppose a Gage-like defect is found? Will it seem fair to have executed the man if he was physically incapable of moral judgment? As science begins to unravel bits of personality, accountability unravels with it. The person becomes his parts-some working, some defective through no fault of his own. Will it become incumbent upon society to submit all killers to a brain scan? Would that not be fairer than having psychiatrists battle in court over the merits of an insanity plea?

# మన వార–మాస పత్రికలు

– చలసాని ప్రసాదరావు

తెలుగు విశ్వవిద్యాలయం వారి సదస్సుకోసం "తెలుగు పీరియాడికల్స్‌లో ప్రయోగాలు పరిణామాలు" గురించి ఆలోచింపటం ఈ రచన లక్ష్యం. అందువలన "గత చరిత్ర" లాంటి వివరాల జోలికి పోదలచలేదు.

తెలుగు వారిలో "పీరియాడికల్స్" అనే మాటే అంతగా వాడుకలో లేదు. నిత్య వ్యవహారంలో జర్నలిస్టులు, రచయితలు, పాఠకులు కూడా దినపత్రికలను మినహాయించి, తదితర పత్రికలనన్నింటిని కలిపి ఏకంగా "మ్యాగజైన్స్" అనే వ్యవహరిస్తున్నారు. ఈ కోవలోకి వచ్చేవి తెలుగులో ప్రధానంగా వార–మాస–పక్ష పత్రికలంటూ మూడు రకాలున్నాయి.

ఇవి గాక ద్వైమాస, త్రైమాస, వార్షిక పత్రికలూ, సంస్థాగతమైన "సావనీర్"లూ ఒక కాలపరిమితి అంటూ లేకుండా అవసరాన్ని బట్టి వచ్చేవి అసంఖ్యాకంగా ఉన్నాయి. వీటిలో మన ఏజీ ఆఫీసువారి 'రంజని' కలకత్తా ఆంధ్రసంఘం, మద్రాస్ "కథాసాగర్" వారి వార్షిక పత్రికలు, రాజా–లక్ష్మి ఫౌండేషన్‌వారి "రజత కమలం" సాహిత్యప్రియుల అభిమానాన్ని చూరగొన్నాయి. వాస్తవంలో వీటన్నింటికి ప్రేరణగా ఒక దశవరకూ భారీగా వెలువడిన "ఆంధ్ర పత్రిక" సంవత్సరాది సంచికలను చూపుకోవచ్చు.

ప్రస్తుతం తెలుగులో 'మ్యాగజైన్స్' అంటే వార–మాస–పత్రికలే అన్నట్లుగా ఉంది వాటి ప్రాముఖ్యత. పక్షపత్రికలు తెలుగువారికి అంతగా అలవాటులోకి వచ్చినట్లు లేవు. ఈ కోవకు చెందిన పత్రికలేవీ స్థిరంగా నిలవలేదు. నిలిచినవికూడా సక్రమంగా వెలువడటమూ లేదు.

"సచిత్రవారపత్రిక"లుగా వెలువడుతున్నవి ఇప్పుడు ప్రముఖంగా చెప్పుకోదగిన స్థాయిలో కనీసం ఎనిమిది ఉన్నాయి. వీటిలో సగం పత్రికల అమ్మకాలు 50 వేలు దాటి, లక్ష దాకా వెళ్లగలగటం ఒకరకంగా సంతోషించదగిన పరిణామమే. అది మన పాఠకులలో పెరిగిన పఠనాసక్తిని సూచిస్తుంది. అదే సమయంలో వారికి అందిస్తున్న సాహిత్యపు స్థాయి విషాదాన్నీ కలిగిస్తుంది.

ఈ "సచిత్ర వారపత్రిక" అనే బిరుదునామంలాంటి విశేషణం ఏనాడో "ఆంధ్రపత్రిక"వారు సృష్టించుకున్న మాట. తమ దిన–వార పత్రికలు రెండింటికీ వారు "ఆంధ్రపత్రిక" అనే పేరే వాడుతున్న కారణాన, ఆ రెండింటికి స్వభావంలో గల తేడాను చూపుకోవడం కోసం కొండగుర్తులాగా 'ఆంధ్రపత్రిక –సచిత్రవారపత్రిక' అనే మాటను ప్రచారంలోకి తెచ్చారు. అదే ఆ తరువాతి కాలంలో "ఆంధ్ర సచిత్రవారపత్రిక" గానూ ప్రసిద్ధమయింది. ఈనాటి వారపత్రికలన్నీ ఆ మాటనే తిరగా బోర్లా వేసి వాడుకుంటున్నాయి.

ఈ వరవడిలోనే దినపత్రికలవారు తమ సంస్థల వారపత్రికలు కూడా ప్రచురించటం, దానికి కూడా ప్రసిద్ధిలో ఉన్న తమ దినపత్రిక పేరే పెట్టటం ఆ తరువాతి కాలంలో ఆచారం అయిపోయింది. ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఉదయం అన్నీ ఇలా వచ్చినవే. "ఆంధ్రభూమి" వారు మరో అడుగు ముందుకు వేసి వారపత్రికతో పాటు అదేపేరుతో మాసపత్రికను కూడా వెలువరిస్తున్నారు.

ఇలా దినపత్రికా వ్యవస్థ అండలేకుండానే ఆరంభించినా అనతికాలంలోనే నిలద్రొక్కుకుని, స్థిరపడిన ఘనత ఒక్క ''స్వాతి''కి మాత్రమే దక్కుతుంది. వారి మాసపత్రిక వెనుకబడినా, వారపత్రిక పాఠక జనాదరణ పొందగలిగిందంటే సంపాదకుడు తొలినుండి కూడా, అదెలాంటిదయినా సరే, తన పత్రికకొక ప్రత్యేకతను చూపాలని చేసిన తీవ్ర ప్రయత్నమే అందుకు కారణం.

ఒక దశలో తెలుగులో వారపత్రికలతో సమానంగా మాసపత్రికలూ ఉండేవి. వారపత్రికలకు భిన్నంగా ఉండాలని ప్రయత్నించి, తమతమ ప్రత్యేకతలతో అవి పాఠకులను ఆకట్టుకోగలిగాయి. స్వాతి, జ్యోతి, యువ, విజయ అలాంటివే. విషయంలో ఎవరి దారి వారిదే. అందువలననే అవి వారపత్రికల పోటీని తట్టుకోగలిగాయి కూడా.

ఈ విజయం చూసి మధ్యలో అనేక మాసపత్రికలు వచ్చినా, ఏ ప్రత్యేకతా చూపలేని కారణాన్నే గత దశాబ్దకాలంలోనూ కనీసం ఒక డజనుపైగా ''సచిత్ర మాస పత్రిక''లు మాయమయ్యాయి. ప్రస్తుతం స్వాతి, జ్యోతి, యువ, ఆంధ్రభూమి, విపుల, చతుర మాసపత్రికలతోపాటు వనిత, వనితాజ్యోతి, కలువబాల పేర్లతో మహిళా పత్రికలు వెలువడుతున్నాయి. 'చందమామ' వరవడిలో డజను దాకా పిల్లల మాసపత్రికలు వస్తున్నా స్వరూప–స్వభావాలలో ఇవన్నీ ''చందమామ''కు నకళ్లుగానే రూపొందు తున్నాయి. ఇన్ని పిల్లల పత్రికలున్నా ఇంగ్లీషులో పిల్లల్ని ఎంతగానో ఆకట్టుకున్న ''ట్వింకిల్'' వంటి బొమ్మల కథల పత్రిక ఏదీ మనకు లేకపోవడం మన భావ దారిద్ర్యానికి, సాహసం లేమికి మచ్చుతునకగానే ఉంది.

''పీరియాడికల్స్'' అనే శాస్త్రీయనామ పరిధిలోని ''పాప్యులర్ మాగజైన్స్'' ఇవే అనుకుంటే, వీటిలో ప్రస్తుతం పాఠకులను అధికంగా ఆకర్షిస్తున్నవి వారపత్రికలు. ఈనాటి మనవార పత్రికలన్నీ సెన్సేషనల్, సస్పెన్స్ సీరియల్స్ మయంగా మారిపోయి చవకబారు నవలల్తో పాఠకులను పాడుచేస్తు న్నాయనే విమర్శ ప్రముఖంగా ఉంది.

అసలు ''సీరియల్'' అనేది మనకు క్రొత్తదేం కాదు. ఎలాంటి సీరియల్స్ అనేదే అసలు ప్రశ్న. నలభై సంవత్సరాల క్రితం ఉన్న ఏకైక వారపత్రిక ''ఆంధ్రపత్రిక'' కూడా ఏ పోటీలులేని రోజుల్లోనే సీరియల్స్ ప్రచురించింది.

అయితే, ఆ రోజుల్లో సీరియల్ అనేది నవల సైజునిబట్టి ఏర్పడిందే తప్ప, ఈనాటి సీరియల్స్‌లా ఏ వారానికావారం ''సస్పెన్స్''ని నిలబెట్టుకుంటూ పోయే లక్ష్యంతో పనిగట్టుకుని రాయించుకున్నవి కావు. అప్పట్లో ఆంధ్రపత్రిక కథలు, వ్యాసాలు, సాహిత్య విషయాలు, సినిమా కబుర్లతో పాటు ప్రత్యేకంగా ఓ నవలను కూడా వారాల తరబడి ప్రచురించేది. అలెగ్జాండర్ డ్యూమా, ఎడ్గార్ వాలెస్, జూల్స్‌వెర్న్ వంటి పాశ్చాత్య రచయితల నవలలను ఆకర్షణీయంగా అనువదింపచేసి పాఠకులను ఉర్రూతలూగించి పఠనాసక్తిని పెంచిందానాటి ఆంధ్రపత్రిక. అదలా కొనసాగి తెలుగులో నవలా రచనకు ప్రోత్సాహాన్ని చ్చింది. శారద, వాసమూర్తి, అవసరాల రామకృష్ణారావు, కొమ్మూరి వేణుగోపాలరావు, పిలకా గణపతి శాస్త్రి వంటి వారెందరో వైవిధ్యంగల నవలలను అందించారు. ఆ తరువాత ఆరంభమైన ఇతర వారపత్రికలు కూడా ఈ వరవడిలోనే ఉత్తమ సాహిత్య విలువలు, తెలుగు జీవితం ఉన్న నవలలు అనేకం ప్రచురించాయి. ఎందరెందరో నూతన రచయితలు వెలుగులోకి వచ్చారు.

అప్పట్లో ''నవల'' అనేది సమగ్ర చిత్రణకు ఆలంబనం గనుక, సైజునుబట్టి అనేక వారాలపాటు ప్రచురించటం అనేది జరుగుతుండేది. వారం వారం సస్పెన్స్ దగ్గరే ఆపుచేసి పాఠకులను ఆకట్టుకునే

దృష్టి ఉన్నా కేవలం అందుకోసమే ''నవలలు రాయించటం'' అనేది అరుదు. అయినా ఆ నవలలు ఆనాటి పాఠకుల్ని చదివింపజేసేవి. కొన్నయితే ఉ(ద్రూతలూగించేవి. ఈ నవలల్లో సస్పెన్స్ అయినా, మరే ఆకర్షణ అయినా నవలలో అత్యంత సహజమైన భాగంగానే ఉండేది. అలాంటిది ఇన్నేళ్లలోనూ వచ్చిన మార్పులతో అసలు నవలా, దానిలోని పాత్రలూ, సంఘటనలూ సమస్తం సస్పెన్స్, తప్పితే సెన్సేషన్ కోసమే అన్నట్లుగా తయారయింది.

ఫలితంగా, సహజంగానే ఈనాటి సీరియల్స్‌లో ఉత్తమాదర్శాలు, పాఠకుల సంక్షేమం, ప్రయోజనాలు లుప్తమై, పత్రికల వ్యాపారం మాత్రమే పరమ ప్రయోజనంగా మిగిలిపోయింది. రచయితల పాత్ర తగలడుతున్న కొంపల్లోంచి పల్లీలో, వెండి–బంగారాలో వారి సత్తాకొద్దీ సంపాదించుకునే స్థాయికి పడిపోయింది. ''మార్కెట్'' దృష్టితో తప్పితే ఈనాటి మన ''మ్యాగజైన్స్''లో వస్తున్న ''సీరియల్స్'' గురించి చెప్పుకునేందుకు ఏమీ లేనట్లే. ఎడిటర్లు, రచయితలు, ప్రచురణకర్తలు కలిసి పాఠకుల్ని ఒక విషవలయంలో పరిభ్రమింప జేస్తున్నారు.

అయితే, ఈ సీరియల్ ''వేవ్'' మొదలయిన తొలినాళ్ళంత జోరుగా లేదీనాడు. పాఠకులు ఎగబడి చదివే ''క్రేజ్'' కూడా గణనీయంగా తగ్గిపోయింది.

ఇంతకుమించి మన ''మ్యాగజైన్స్''లో ఇటీవలికాలంలో వచ్చిన ''పరిణామాలు–ప్రయోగాలు'' చెప్పుకోదగ్గవి మరేం లేనట్లే. ఒక దశాబ్దకాలం పాటు మన మ్యాగజైన్స్ క్రొత్త పాఠకుల కోసం ఈ సీరియల్స్ చిట్కాలతో తీవ్రంగా ప్రయత్నించి సర్క్యులేషన్లను కొంతవరకూ పెంచుకోగలిగాయి. కానీ, లక్ష కాపీల అమ్మకం అనేది మన తెలుగు వారపత్రికలకు ఘనంగానే కనిపిస్తున్నా మన పొరుగున ఉన్న కన్నడ, తమిళ, మలయాళ పత్రికల్తో పోలిస్తే మాత్రం తక్కువే. ఇటీవలి కాలంలో ''రికార్డ్'' అనుకున్న ఆ లక్ష కూడా స్థిరంగా నిలబడలేదు. దీనిని బట్టి ఆ ''సరుకు'' నాణ్యత తెలిసిపోతుంది. వాపునే బలుపుగా భ్రమించినట్లూ తేలుతుంది.

సర్క్యులేషన్ల పరుగుపందెంలో వారపత్రికలను చూసి మాసపత్రికలు అవే వాతలు పెట్టుకున్నా నిల్వలేకపోయాయి. వారపత్రికలకు భిన్నమైన రీతిలో తమ ప్రత్యేకతలను ప్రదర్శించి, తమ వ్యక్తిత్వాలను నిలబెట్టుకోడానికి బదులు వారపత్రికల మూసను అనుసరించబోయాయి. వారపత్రికల సైజులో సగం ఉన్నా ధర మాత్రం రెట్టింపు అనే భావం పాఠకుల్లో ప్రబలటం వలన కూడా మాసపత్రికలు మరికొంత దెబ్బతిన్నాయి.

అందుకే ఇది వారపత్రికల యుగం అనే మాట వచ్చింది. అయితే, వారపత్రికలు కూడా ఇపుడో కొత్తపోటీని ఎదుర్కోవలసి వచ్చేట్లున్నది.

గతంలో మన తెలుగు దినపత్రికల ఆదివారం అనుబంధాల్ని ప్రత్యేకించి, ''సారస్వతాను బంధం'' అనేవారు. నాలుగు పేజీల నిండా సాహిత్యం, సంస్కృతి, కళలు, సినిమాలు, నాటకాలు గురించి ఉండేది. రానురాను అవికూడా ''మూస''గా తయారై ఆకర్షణను కోల్పోయి పాఠకుల నిరాసక్తతకు గురి కాసాగాయి.

ఇలాంటి స్థితిలో పదిహేనేళ్ళ క్రితం ''ఈనాడు ఆదివారం'' ఆ ''మూసను'' ముట్టుకోకుండా ఆసక్తికరమైన యథార్థ సంఘటనలను ఆకర్షణీయంగా ప్రచురిస్తూ, పాఠకుల్లో సంచలనం రేకెత్తించింది. ఫలితంగా మిగతా దినపత్రికల అనుబంధాలు కూడా క్రమంగా ఆ దారిలోకే వచ్చేశాయి. దీనికితోడు అమ్మకాలు నిలబెట్టుకునే, పెంచుకునే పరుగుపందెంలో అనుబంధాల సంగతలా ఉంచి ఏకంగా

దినపత్రికల్లోనే రోజువారీ సీరియల్స్ ప్రచురణ ఆరంభమయింది. ఆదివారం అనుబంధాల పేజీలు మారి రంగుల్లో ముద్రించటం సాధారణమైపోయింది.

ఇవన్నీ కలిసి సహజంగానే ''మ్యాగజైన్స్'' ఆకర్షణను కొంత తగ్గించాయి. అన్నింటికీ మించి మన వార–మాస పత్రికలు జీవన్మరణ సమస్యగా ఎదుర్కోవలసి వచ్చినా ఆశ్చర్యం లేదు.

ప్రస్తుతం మన వార–మాస పత్రికలకు రచనల విషయంలో ఒక నిర్దిష్ట దృక్పథం ఉంటూ వస్తూ ఉన్నట్లు కనిపించదు. ఏదో ఒక విధంగా పాఠకులను ఆకర్షించుకొని అమ్మకాలు పెంచుకోవటం, లేదా నిలబెట్టుకోవటం మాత్రమే వాటి లక్ష్యం అన్నట్లుంది పరిస్థితి. ఈ పరుగుపందెంలో మాసపత్రికలు వెనుకబడిపోయినట్లే. సంచికకు సంచికకు మధ్య ఉండే నాలుగు వారాల వ్యవధి, ఈ లోగా వచ్చే వారపత్రిక తాలూకు నాలుగు సంచికలలో తమకు లభ్యంగాని దేనినీ అదనంగా అందించలేని మాసపత్రికల ''మాస'', ధర ఆరేడు రూపాయల దాకా పెరిగిపోవటం ఈ వెనుకబాటుకు ప్రధాన కారణాలు. వారపత్రికలు ''సీరియల్స్''కూ, వాటి రచయితలకూ ఊదరగొట్టుడు పద్ధతిలో ''గ్లామర్''ను విశేషంగా పెంచుతూ వచ్చాయి. దీనికితోడు రచనల బాగోగులు ఎలా ఉన్నా రచయితలు కూడా మారిన పరిస్థితుల్లో పాఠకులను ఆకట్టుకోవటం కోసం కొంత కష్టపడినా సంభవించాయి. ఉత్కంఠభరితమైన సమాచారంతో నిండి ఉండే ''ఏర్‌పోర్ట్'', ''హోటల్'', ''హాస్పిటల్'' వంటి ప్రఖ్యాతమైన ఆంగ్ల నవలలను మోడల్‌గా తీసుకుని రకరకాల కొత్త సబ్జెక్టులలో ఎంతో కొంత సమాచారంతో పాఠకులను ఆకట్టుకునే ప్రయత్నాలు జరిగాయి. వాస్తవంలో పాశ్చాత్య రచయితలంత విస్తృతి, లోతులకు వెళ్లకపోయినా, ''ఇన్వెస్టిగేటివ్'' నవలలని చెప్పి ఊదరగొట్టసాగారు. ''చెట్టు లేని చోట ఆముదపు మొక్కే మహావృక్షం'' సామెతగా పాఠకులను ఇవి కొంతకాలం ఆకట్టుకున్నాయి. ఈ దశలో వారపత్రికల్తో సమానంగా పరుగెత్తలేక మాసపత్రికలు సహజంగానే వెనుకబడిపోయాయి.

ఈ దృష్ట్యా చూసినపుడు మన ''తెలుగు పీరియాడికల్స్‌లో ప్రయోగాలు'' కేవలం సర్క్యులేషన్ కోసం సీరియల్స్ రూపంలోనూ, ''పరిణామాలు'' యుక్తాయుక్త విచక్షణ లేని వాటి ఇతివృత్తాల్లోను మాత్రమే జరిగాయనుకోవాలి. శృతిమించిన ''అశ్లీలత'' ఆరోపణతో కోర్టుపక్షాన కారణంగా ఒక సీరియల్‌ను ఒక వారపత్రిక వారు ఆపుచేయవలసి వచ్చింది. ''అసభ్యచిత్రణ'' ఆరోపణతో మరో సీరియల్‌ను ఇంకో వారపత్రిక వారు ఆపుచేయవలసి వచ్చింది. దీనిని బట్టి ఇటు రచయితలూ, అటు పత్రికా సంపాదకులూ పాఠకుల పట్ల ఎంత బాధ్యతగా వ్యవహరిస్తున్నదీ ఊహించుకోవచ్చు.

ఇవి తప్ప మిగిలిన అంశాలన్నీ మన వార–మాస పత్రికలు కొద్దిపాటి తేడాలు మినహా అవి పుట్టినప్పుడెలా ఉన్నాయో ఇప్పుడూ దాదాపు అలాగే ఉన్నాయి. రచయితలకు తాత్కాలికంగా ''గ్లామర్'' పెరగటం, పత్రికలకు గుమాస్తాలు, ప్రూఫ్‌రీడర్లే గాక ఎడిటర్లు కూడా అవసరమేననే స్పృహ రావటం వినా మరేం జరగనట్లే.

జరిగిందంటూ ఏమన్నా ఉంటే, తెలుగు సినిమాల్లాగే కొన్ని తెలుగు ''పీరియాడికల్స్'' కూడా సకుటుంబంగా చదువుకోడానికి అనువుగా లేనంతగా అభివృద్ధి చెందాయి అంతే!

ఇదంతా భారీ పెట్టుబడులతో, మంచి అమ్మకాలతో పోటీ పడుతున్న తెలుగు మ్యాగజైన్ల సంగతి. ఇవికాక వివిధ రంగాలకు చెందిన అనేక మాసపత్రికలు ఉన్నాయి. కొన్ని సంవత్సరాల పాటు దిగ్విజయంగా నడిచి ఆగిపోయినవి. ''రేపు'' అలాంటి వాటిలో చెప్పుకోదగ్గది. మహిళల కోసం ప్రత్యేకించిన వనిత, వనితాజ్యోతి, కలువబాల పత్రికలు కేవలం గృహిణులుగా వారి అవసరాలకు మెరుగు పెట్టేవిగానే ఉంటున్నాయి. ''ఎంప్లాయిమెంట్ న్యూస్'' పద్ధతిలో ''ఉద్యోగవిజయాలు'' అనీ, ''కాంపిటీషన్ సక్సెస్'' పద్ధతిలో ''ప్రజ్ఞ'' అనీ, గైడ్స్‌కు మారు రూపంగా ''మాబడి'', ''పాఠశాల''

అనీ వస్తున్న కొన్ని పత్రికలకు పాప్యులర్ మ్యాగజైన్స్‌లా గుర్తింపు లేకపోయినా, ఆయా రంగాలవారికి ప్రయోజనకరంగా ఉండి, తమ ప్రత్యేక స్వభావం వలన నిలద్రొక్కుకోగలిగాయి.

ఇహ వివిధ కులాలు, వృత్తులు, ధార్మిక సంస్థలు వగైరాలు నడుపుకునే ''స్వంత'' పత్రికలు తెలుగులో అనేకం ఉన్నాయి. న్యూస్‌పేపర్స్ రిజిస్ట్రార్ వారి చిట్టా ప్రకారం చూస్తే తెలుగులో ''పీరియాడికల్స్'' అనేవి డజన్లకొద్దీ ఉన్నాయి. వస్తున్నవీ, రానివీ కలిపి వందల సంఖ్యలోనూ ఉన్నాయి. అయితే వాటికి గల ప్రచారం దృష్ట్యా చూస్తే మాత్రం పదుగురికీ తెలిసినవి పైన పేర్కొన్న కొద్దిపాటి పాప్యులర్ పత్రికలే.

ఈ కోవలో ఆఖరున వచ్చేవి సాహిత్యపత్రికలు. స్థాయి, అవసరం, సాంఘిక ప్రయోజనాల దృష్ట్యా న్యాయంగా ఇవి ప్రథమస్థానంలో ఉండాలి, కానీ, అనేక కారణాల వలన సాహితీపరుల్లో కూడా కొద్ది మంది వరకే వీటి ప్రచారం పరిమితమై ఉంటున్న దుస్థితి నెలకొని ఉన్నది. దాదాపుగా ఇవన్నీ ఏదో ఒక రాజకీయ పక్షానికి అనుబంధ పత్రికల్లా వెలువడుతున్నవే. ఆయా రాజకీయ పక్షాలకు గల ఆర్గనైజేషనల్ వ్యవస్థ దృష్ట్యా అయినా ఇవి కొన్నివేల మందికి సరాసరి అందవలసి ఉన్నాయి. అయినా అలా జరగక వీటి సర్క్యులేషన్ ఏనాడూ రెండువేలకు మించని దుస్థితి ఎదురవుతున్నది. గ్రూపు రాజకీయాలెలా ఉన్నా, వాటితో నిమిత్తం లేకుండా కూడా సాహితీ పరులంతా చదువదగిన, చదవవలసి ఉన్న ఉత్తమ రచనలు కొన్నయినా వీటిలో వస్తున్నాయి. అయినా ఇలా ఎందుకు వెనుకబడి ఉంటున్నాయో ఆలోచించాలి.

మన ''వ్యాపార పత్రికలు''ఇన్నేళ్లలోనూ రకరకాల ప్రయోగాలు చేసిన మాట నిజమే. పాఠకుల సంఖ్యను పెంచి అమ్మకాలు గణనీయంగా పెంచుకున్న మాటా నిజమే. కానీ, సాహితీ విలువలు, పాఠకుల శ్రేయస్సూ దృష్ట్యా చూస్తే సాధించింది ఏమీ లేనట్లే. తొలినాళ్లల్లో గల నిజాయితీని, బాధ్యతను విస్మరించిన పత్రికలే ఎక్కువ. పిల్లవాడి ఏడుపుకు అసలు కారణం తెలుసుకుని సరైన ఆహారం, మందులు ఇవ్వటానికి బదులుగా నల్లమందు తినిపించి నిద్రపుచ్చటంలా ఉంది ఈనాటి పరిస్థితి. ఆ నల్లమందు ఎంత ఎక్కువ మోతాదులో ఇచ్చి పిల్లవాడు చావకుండా నిద్దరోతుండేలా చూడగలడో వాడే సమర్థుడైన సంపాదకుడు అన్నట్లుగానూ ఉంది పరిస్థితి.

ఈ ధోరణులకు లొంగని వ్యాపార ''మ్యాగజైన్స్'' సైతం కొన్నయినా మనకు ఉన్నాయి. అయితే ప్రస్తుతం అవి ఈ పరుగుపందాలకు దూరంగా ఉండి వెనుకబడిపోవటం జరుగుతోంది.

ఈ పరిస్థితి ఇలా ఇంకెంతకాలం? అనే ప్రశ్న సహజంగా వస్తుంది.

కానీ మార్పులేకుండా ఏదీ అలాగే కలకాలం ఉండిపోదు. ఉంటే కుళ్ళి కృశించి పోకా తప్పదు. మరి, ఆ మార్పు ఎప్పుడు? ...? ఎలా?... జరుగుతుందీ అనేది రచయితలు, సంపాదకులు, ప్రచురణకర్తల సంస్కారం మీదా, నిజాయితీ మీదా ఆధారపడి ఉంటుంది. మనవారికి అది లేదని ఈనాటి ''పీరియాడికల్స్'' స్వరూప – స్వభావాలు రుజువు చేస్తున్నాయి. కనుక, వీరందరనీ దారికి తీసుకురాగలది కేవలం పాఠకుల చైతన్యం మాత్రమే.

ఆ చైతన్యాన్నివ్వగల రచయితలు, పత్రికలు, ప్రచురణా సంస్థలు కొన్నయినా లేకపోలేదు. వారికిది గడ్డుకాలం. నిజమే! కానీ, ఏనాటికయినా వీరే చరిత్ర నిర్మాతలు.

(తెలుగు విశ్వవిద్యాలయం, జర్నలిజం శాఖ నిర్వహించిన ''తెలుగు పత్రికలలో కొత్త ప్రయోగాలు – పరిణామాలు''పై సెమినార్‌లో చదివిన ప్రసంగ వ్యాసం. 12 ఏప్రిల్ 1989)

# అభిప్రాయాలను, వాస్తవాలను కలగలపవద్దు

- సి. నరసింహారావు

మీరు పైకి వెలిబుచ్చే అభిప్రాయాలు, కేవలం అభిప్రాయాలే కాదని, అవి వాస్తవాలని, అనుకొంటారా? ఇతరులేం చెప్పినా, మీ అభిప్రాయాలే సరైనవని, సమర్థించుకోవడానికి ప్రయత్నిస్తారా? మీ అభిప్రాయాలే గొప్పవని, ఇతరుల వద్ద నిరూపించకపోతే, మీరు తెలివితక్కువవారని ఎదుటివారు భావిస్తారేమోనని, భయపడుతున్నారా? ఇవన్నీ పొరపాటు ఆలోచనలు.

## అభిప్రాయాలను, వాస్తవాలను కలగలపవద్దు

భిన్న అభిప్రాయాలను సహించడం, మనం చెప్పేదానికి భిన్నమైన అభిప్రాయాలను, సావధానంగా వినడం, మన ఉన్నతికి తోడ్పడుతుంది. ఎదుటివారి అభిప్రాయం మనకు నచ్చనంతటి మాత్రాన, వారిని హేళన చేయడం, అవమానపరచడం ఏ పరిస్థితిలోను సమర్థనీయం కాదు. మనకు ఇష్టంలేని అంశాలనేకం వుండవచ్చు. మనకు ఇష్టం లేనంతటి మాత్రాన, అవన్నీ తప్పులుగా పేర్కొనడం సబబుకాదు. అభిరుచులు, అభిప్రాయాలు, విశ్వాసాలు అనేక రకాలుగా, ప్రతి ఒక్కరికీ భిన్నంగా వుండవచ్చు. వీటిని గురించి వాదించుకోవడం, మీ పంతమే నెగ్గాలనుకోవడం, తప్పు.

మనకు స్వాతంత్ర్యం ఎప్పుడు వచ్చిందన్నది ఒక వాస్తవం. దీన్ని గురించి వాదోపవాదాలకు ఆస్కారంలేదు. కాని మనదేశంలో ఏ రాజకీయ పార్టీ మంచిదన్న విషయంలో భిన్నాభిప్రాయాలు వుండవచ్చు. ఇటువంటి విషయాల గురించి చర్చ వచ్చినప్పుడు, మీరు సంయమనంతో వ్యవహరించాలి. ఎదుటివారికేమీ తెలియదని, వారిని నిందించడం, మీరు చెప్పేదే వాస్తవమని, వాదించడం మానండి. అలాగే ఈ భిన్నాభిప్రాయాలను మీ మిత్రులకు తెలియజెప్పడానికి ప్రయత్నించండి. ఎదుటివారికేమీ తెలియదని మీరు నిందించిన ప్రతిసారీ, ఆ విషయాన్ని నోట్ బుక్‌లో గుర్తించండి. అలాగే ఎదుటివారు ఉద్రేకానికి లోనయి మిమ్మల్ని నిందించబోతుంటే, ఎదుటివారు విభేదించబోతున్నారని గుర్తుచేయండి. విభేదించడం, ఆవేశపూరితంగా చేయనక్కరలేదని చెప్పండి. అలాగే వివిధ సంభాషణల్లో, ఏది వాస్తవానికి సంబంధించిందో, ఏది అభిప్రాయాలకు, విశ్వాసాలకు సంబంధించిందో, విభజించి చూడడం అలవాటు చేసుకోండి.

## జీవితాన్ని సంతోషమయం చేసుకోవడం మీ జన్మహక్కు

జీవితంలో కష్టపడి పనిచేయాలే తప్ప, ఆనందంగా వుండాలనుకోవడం సరికాదని, ఎప్పుడూ సుఖంగా వుండడానికి అలవాటుపడిన వారు ముందుకెదగలేరని, సుఖం వెనుక దుఃఖం వుంటుందని, ఈ జీవితమంతా కష్టపడితే, మరుజన్మలో ఆనందం లభిస్తుందని మీరు అనుకొంటుంటే, అది తప్పు అని, వేరే చెప్పనవసరం లేదు.

సంతోషంగా వుండటం, జీవితాన్ని ఆనందంగా గడవడం మన జన్మహక్కు. నిరంతరం కష్టపడుతూ, త్యాగాలు చేస్తూ, ఏదో సాధించగోరుతూ, అష్టకష్టాలు పడే వ్యక్తులు, తమ జీవితాన్ని, చాల

నిస్సారంగా మార్చుకొంటారు. తామెంతటి సంపదను ప్రోగు చేసుకోగలిగినా, సంతోషంగా వుండలేక పోతారు. మీరు మరెవ్వరికీ హాని చేయనంతటి వరకూ, మీరు సంతోషంగా వుండడానికేమైనా చేయవచ్చు.

మీరు, మీకిష్టమైన పనిచేయకుండా, ఎప్పుడెప్పుడు వుండిపోవలసి వస్తోందో, మీ నోట్ బుక్‌లో వ్రాసుకోండి. ప్రతిరోజూ, మీ విధి నిర్వహణలో ఎంత సమయం గడుపుతున్నారో, మీ ఆనందం కోసం ఎంతటి సమయాన్ని కేటాయిస్తున్నారో, గుర్తించండి. ప్రతిరోజూ ఒక గంటసేపు, మీకు బాగా ఇష్టమైన పనులే చేయడానికి, ఉద్యుక్తులు కండి. ఆనందం లభిస్తుంది గదా అని మీ ఆరోగ్యానికి హానికరమైన పనులు, చేయ ప్రత్నించవద్దు. మీకు ఎక్కువ సంతోషం కలిగించే పనులేమిటో నోట్ బుక్‌లో వ్రాసుకోండి. మీ దైనందిన కార్యక్రమంలో ఆ పనులను చేర్చడానికి ప్రయత్నించండి.

మీరే నిర్ణయం తీసుకొనే ముందయినా, దాని మంచిచెడుల గురించి సుదీర్ఘంగా చర్చించుకోవడం, పదిమందీ నడిచే బాటలోనే నడవాలే తప్ప, కొత్త పుంతలు త్రొక్కడం శ్రేయస్కరం కాదని, అనుకొంటున్నారా? అలాగే పరుగెత్తి పాలు త్రాగడం కంటే, నిలబడి నీళ్ళు త్రాగడం మంచిదనుకొంటు న్నారా?

## తర్జన భర్జనలతో కాలాన్ని వెళ్ళబుచ్చవద్దు

మీరే పనిచేయాలనుకొన్నా ముందు వెనుకలు, మంచి చెడులు, ఆలోచించుకొంటూ కూర్చుంటే, మీరు జీవితంలో వెనుకబడిపోవడం జరుగుతుంది. వెనుకవెనుక మిగిల్చివేసే బద్ధకాన్ని, భయాన్ని, వదిలించుకోనంతటిసేపూ, ఏం సాధించాలన్నా సాధ్యపడదు. ప్రమాదకరమైన మార్గాన్ని ఎంచుకోవద్దు. అలాగే హానికరమైన పనులు చేయతలపెట్టవద్దు. కాని ప్రతి క్షణమూ లాభనష్టాలు బేరీజు వేసుకొంటూ కూర్చోవద్దు. కాని క్రొత్తదనాన్ని, ఆ క్రొత్తదనంతోపాటు ఎదురయ్యే సందిగ్ధాన్ని, ఎదుర్కొనడానికి భయపడకూడదు. కొత్త ఉద్యోగం కోసం ప్రయత్నించడం, లేదా క్రొత్త వ్యాపారాన్ని ప్రారంభించడం, మీ అభిప్రాయాన్ని ఖచ్చితంగా వెలువరించడం, మీ కిష్టంలేని వ్యక్తితో మీ స్నేహాన్ని తెగతెంపులు చేసుకోవడం, కేవలం మీ చొరవ వల్లనే, సాధ్యపడతాయి. ఇలాంటి చొరవ, ప్రతి సందర్భంలోనూ గైకొనగల్గితే, మీ జీవితం ఎంతో ఉత్తేజపూరితంగా పరిణమిస్తుంది. ఇటువంటి చొరవ గైకొనడం, మీకు ఇబ్బందికరమే కావచ్చు. కాని చొరవ, సాహసం లేనప్పుడు జీవితంలో ఒంటరితనం, నిస్పృహే మిగులుతాయి. జీవితంలో ఏమాత్రం సాహసం చేయలేని వ్యక్తులు స్తబ్దంగా మిగిలిపోతారు. తమకేదో అదృష్టం కలసివస్తుందని, ఏదో అద్భుతం జరుగుతుందని, వారు ఎదురు చూస్తూ, పగటికలలు కంటుంటారు.

మీరింతకాలంగా చేయాలనుకొంటూ చేయలేకపోతున్న పనులేమిటో, మీ నోట్ బుక్‌లో వ్రాయండి. అవి చేయడానికి, మానసికంగా సంసిద్ధం కండి. ఎవరినైనా మీ ఇంటికి ఆహ్వానించాలను కొంటే - వెంటనే ఆ పనిచేయండి. ప్రతి రోజూ మీరు చేయాలనుకొంటూ వెనుకాడుతున్న పని, కనీసం ఒక్కటైనా చేయడం, అలవాటు చేసుకోండి. ఒక వారం రోజుల్లో మీరు ఇంతకాలంగా చేయలేకపోతున్న పనులు ఏడు చేయగలుగుతారు. ఫలితంగా మీకెంతో ఆత్మ విశ్వాసం చేకూరుతుంది.

## ఇతరుల సహాయ, సహకారాలు కోరే అధికారం మీకుంది

మీరు, ఇతరుల సహాయం కోరడం అంటే, మిమ్మల్ని మీరు లోకువ చేసుకోవడమేనని, ఎవరి

సహాయసహకారాలు లేకుండా పైకి రావడమే గొప్ప, అని అనుకొంటున్నారా? ఇతరుల సహాయాన్ని అర్థించడమంటే, మీ చేతగానితనాన్ని రుజువుచేసుకోవడమేనని భావిస్తున్నారా? ఇవి పొరపాటు అభిప్రాయాలు.

మనం ఇతరులపై నిస్సహాయంగా ఆధారపడడం వేరు. ఇతరుల సహాయాన్ని స్వీకరించడం వేరు. ఈ సమాజంలో, పరస్పర సహకారంతోనే, మనం మన కల్గుతున్నాము. మనం వుండే ఇంటిని మనం కట్టుకోలేము. మనకు కావలసిన ఆహారాన్ని మనం పండించుకోలేము. అలాగే మనకు కావలసిన దుస్తులను మనం తయారుచేసుకోలేము. ఏ వైద్యుడైనా తనకు తాను శస్త్రచికిత్స చేసుకోలేడు. మనకు ఏ పనిచేయగల సామర్థ్యమయినా వుందని, ఇతరుల సహాయ సహకారాలు అవసరం లేదని అనుకోవడం చాలా తప్పు. మీకున్న ప్రతిభ ఇతరులకు లేకపోవచ్చు. అలాగే ఇతరులకుండే ప్రతిభ మనకు వుండకపోవచ్చు. ఇతరుల ప్రతిభా విశేషాలను స్వీకరించడం మనకే లాభదాయకం. ఇలా ఇతరుల ప్రతిభను అంగీకరించలేని వ్యక్తి, అందరినీ అనుమానిస్తూ, విరోధభావం వ్యక్తం చేస్తూ, తననుతాను సమర్థించుకొంటూ, అందరికీ దూరమైపోవడం జరుగుతుంది. ఇతరులను కూడగట్టగలిగిన వ్యక్తి ఏ పనైనా సమర్థవంతంగా నిర్వహించగలుగుతాడు.

ఇతరుల సహకారాన్ని అభ్యర్థించవలసిన సందర్భాలలో కూడా, కేవలం మీ అతిశయం వలన, అలా కోరని సందర్భాలేమిటో నోట్ బుక్‌లో గుర్తుచేయండి. ఇకముందు ఎదుటివారి సహాయాన్ని అభ్యర్థించడానికి సంశయించవద్దు. మొదట్లో మీకిది చాలా ఇబ్బందికరంగా వుండవచ్చు. కాని క్రమంగా ఇది మీకు ఆహ్లాదకరంగా తోస్తుంది. అలాగే, ఎవరు మీకు ఎంతగా తోడ్పడినా, వారికి తక్షణమే ధన్యవాదాలు తెలియజేయండి. అలాగే ప్రతిరోజు, మీరు ఇతరుల నుండి ఏం కోరుతున్నారో, గుర్తు తెచ్చుకొని మీ నోట్‌బుక్‌లో పొందుపరచండి.

ఇబ్బందికరమైన సన్నివేశం ఎదురైనప్పుడు, ముఖం చాటువేయడమే ఉత్తమమని భావిస్తున్నారా? ఆ సన్నివేశాన్ని ఎదుర్కొంటే పరిస్థితి మరింత అధ్వాన్నమవుతుందనుకొంటున్నారా? అలాగే, మీరు, బాధాకరమైన విషయాలను పట్టించుకోకుండా వుంటే - ఆ సమస్య తొలగిపోతుందనుకొంటున్నారా? ''అంతా మంచే జరుగుతుంది'' - అని మీకు మీరు నచ్చజెప్పుకోగలిగితే, మీరు ఆశించినట్లే జరుగుతుందనుకొంటున్నారా? ఇవన్నీ పొరపాటు అభిప్రాయాలు.

## తప్పించుకు తిరుగువాడు ధన్యుడు కాదు

మీకు ఇబ్బందికల్గించే విషయాలను పట్టించుకోకుండా, ముఖం చాటువేయడం ఆరోగ్యకర ధోరణి కాదు. అలా మీరు పట్టించుకోకుండా వుండడం వలన, ఆ సమస్య ఏమాత్రం పరిష్కారం కాదు. పైగా బలవత్తరమవుతుంది. రోజులు గడిచిన కొద్దీ, ఇది మీకు గుదిబండలా తయారవుతుంది. అసలు విషయాన్ని వదలి, దాన్ని సూటిగా పరిష్కరించుకొనే ప్రయత్నం మాని, పరోక్షంగా ఏదో చేయబో వడం మరేదో చెప్పడం, క్రమంగా కపట ప్రవర్తనగా పరిగణించబడుతుంది. మనస్సులో ఏదో దాచుకొని పైకి మరోలా ప్రవర్తించుతుంటే, మీపట్ల, మీ చుట్టూ వున్నవారికి విశ్వాసం సన్నగిల్లుతుంది.

మీరు సూటిగా ఎదుర్కోవడానికి భయపడుతున్న సమస్యలుకాని, సన్నివేశాలు కాని ఏమున్నాయో ఒక్కసారి గుర్తు చేసుకోండి. వాటిని మీరు నోట్ బుక్‌లో వ్రాసుకోండి. ఉదాహరణకు, మీరు ఎవరికైనా బాకీ వుంటే ఎప్పటిలోగా తీర్చడం వీలవుతుందో వివరించి చెప్పండి. అలాగే పాత మిత్రుడికి ఉత్తరం వ్రాయాలనుకొంటూ, వ్రాయలేకపోతుంటే, వెన్వెంటనే ఉత్తరం వ్రాయడానికి సమకట్టండి. అలాగే

మీ ఆరోగ్యాన్ని పరీక్షించుకోవాలని ఎప్పటినుండో అనుకొంటున్నా, హాస్పిటల్‌కు వెళ్లడానికి వెనుకాడుతుంటే, ఇప్పుడా పనిచేయడానికి సంసిద్ధులు కండి. ఈ పనులు ఎలా చేయాలో, పరిణామాలు ఎలా వుండడానికి అవకాశం వుందో, ఓసారి మీలో మీరే సమీక్షించుకోండి. మీకు అప్పు ఇచ్చిన వ్యక్తి వద్దకు మీరు వెళితే, మీరేమి చెబుతారో, దానికి అతనేం అంటాడో, ఊహించుకోండి. తరువాత మీరీ పనిచేయడానికి, పెద్దగా సంకోచించనవసరం వుండదు. ముస్ముందుగా, మీరు కష్టమైన పనులనుకొంటున్నవాటిలో, తేలికైన వాటిని ఎంచుకోండి. ఇవి చేయడానికి సిద్ధం కండి. ఆ తరువాత మరింతటి క్లిష్టమైన పనుల జోలికి వెళ్ళండి. మీరింత కాలంగా వెనుకాడుతూ, ఇప్పుడు చేయాలనుకుంటున్న పనులేమిటో మీ నోట్ బుక్‌లో వ్రాసుకోండి.

## ఏపనినైనా లోపరహితంగా చేయడం అసలు సాధ్యమా?

మీరు ఏ పనినయినా ఏమాత్రం లోపం లేకుండా, చేయాలనుకొంటున్నారా? ఎక్కడా పొరపాటు చేయకూడదని, అలా చేస్తే, అది అసమర్థతకు చిహ్నమని, భావిస్తున్నారా? భార్యాభర్తలు కాని, పిల్లలుకాని, స్నేహాలుగాని, ఉద్యోగాలు కాని, తల్లితండ్రులు కాని, మీరు ఊహించిన ప్రమాణాలకు తగినట్లు వుండాలే తప్ప, అందుకు భిన్నంగా వుండకూడదనుకొంటున్నారా? ఇవన్నీ పొరపాటు అభిప్రాయాలు.

మీరు మరీ ఎక్కువగా ఆశిస్తుంటే మీరు ముందుకెదగలేకపోవచ్చు. ఇతరులతో పోటీపడడానికి ప్రయత్నించవచ్చు. అలాగే ఏ పనినైనా బాగా చేయవచ్చు. అంతేతప్ప ప్రతిదీ ఉన్నతంగా చేయాలనుకోవడం సరికాదు. ఒక రచయిత గొప్ప నవల వ్రాయాలన్న ఆలోచనలతో, మామూలు నవల కూడా వ్రాయలేకపోవచ్చు. అలాగే ప్రతి పనీ, గొప్పగా వుండాలన్న తపన అసౌఖ్యాన్ని, నిస్పృహను కొనితెస్తుంది. మీరు చేయాలనుకొన్నంతటి ఉన్నతంగా చేయడం, మీకు ఎలాగో సాధ్యపడదు. ఈ ప్రపంచంలో ఏ ఒక్కరూ లోపరహితులు కారు. అలాగే మీరు కూడా! మనలో లోపాలు, బలహీనతలు అతి తక్కువగా వుండేటట్లు మనం ప్రయిత్నించవచ్చు. అంతేతప్ప అవేమీ లేకుండా వుండడమన్నది సాధ్యంకాదు.

మీరు ఉన్నతంగా చేయలేనేమోనన్న ఆలోచనతో, అసలు ప్రారంభించకుండా వదలివేసిన పనులేమిటో వ్రాసుకోండి. అలా వదలివేసిన పనులనిప్పుడు ప్రారంభించండి. కొంతమంది బాగా ఆడలేకపోతున్నామన్న భయంతో అసలు ఆడడం మానివేస్తారు. ఇది చాలా పొరపాటు. చివరిలో లభించే జయాపజయాలు ప్రధానంకాదు. అసలు ఆడడంలో లభించే ఆనందం, తృప్తే ప్రధానం.

ఎవరినైనా, వారు చేసిన ఏదో ఒక పని ఆధారంగా, నిర్ణయించి వేయవచ్చునుకొంటున్నారా? ఎవరైనా చెప్పిన మాట నిలబెట్టుకోలేకపోతే, ఇక అతను విశ్వసించదగిన వ్యక్తి కాదని నిర్ణయిస్తారా? అలాగే ఎదుటి వ్యక్తి లోపాలను, ఎత్తిచూపడం వలన అతనిపై మీకు ఆధిక్యత లభిస్తోందని అనుకొంటారా? అలాగే ఒక వ్యక్తి కాల్చే సిగరెట్లు, చూసే సినిమాలు, చదివే పుస్తకాలు, ధరించే దుస్తులు పరిశీలించి, అతనెటువంటివాడో నిర్ణయించువచ్చునుకొంటున్నారా? ఇవన్నీ పొరపాటు అభిప్రాయాలు.

## ఎవరికీ ముద్రలు వేయవద్దు

ఏవో కొన్ని పనులు ఆధారం చేసుకొని, ఒక వ్యక్తి ఎటువంటివాడో నిర్ణయించడం భావ్యంకాదు. ఒకతను ఒక్కో సందర్భంలో, స్వార్థపరంగా వ్యవహరించవచ్చు. కాని అతనిలో, ఇతర లక్షణాలన్నీ, మనకు అమోదయోగ్యమయినవే అయి వుండవచ్చు. ఇతరులను మోసగాళ్ళని, విశ్వసించదగిన వ్యక్తులు

కాదని, స్వార్థపరులని, ముద్రవేయడం మంచిదికాదు, అతను మోసగాడని పేర్కొనే బదులు - అతను వ్యాపారంలో, తన భాగస్వామికి నష్టం కలిగించి, తాను లాభం పొందాడని పేర్కొనాలి. అలాగే ఒక వ్యక్తి, ఫలానా విషయం గురించి అబద్ధం చెప్పాడని అనాలేతప్ప, అతన్ని అబద్ధాలకోరుగా అభివర్ణించడం తగదు. అలాగే, ఎవరిలోనైనా, ఏదో ఒక మంచి లక్షణం వుండడం వలన, అతన్ని, మంచివానిగా పరిగణించడం తగదు. అతని ప్రవర్తనంతటినీ పరిగణనలోకి తీసుకొని అతన్ని అర్థంచేసుకోవాలి. మీరు సైతం ఎన్నో తప్పులుచేసి వుంటారు. అలాగే ఎన్నెన్నో తెలివితక్కువ పనులు చేసి వుంటారు. వీటినాధారంగా మిమ్మల్ని నిర్ణయించడం ఎంతవరకు నబబో మీరే ఆలోచించండి.

మీరు చేసిన పని పొరపాటని అనుకోకుండా మిమ్మల్ని మీరు నిందించుకొనే, సందర్భాలేమిటో గుర్తించండి. ఫలానా పనిచేయడం తప్పు అనుకోకుండా, నేను తెలివితక్కువవాడిని అని, ఎప్పుడైనా అనుకున్నారా? ఆ సందర్భాలను నోట్ బుక్ లో పదిలపరచండి. అలాగే మీరుకాని, మరెవరుకాని, ఒక వ్యక్తి చేసిన పొరపాట్లను నిందించకుండా ఆ వ్యక్తినే నిందించడానికి ప్రయత్నించడాన్ని గమనించండి. అలాగే మీరు ఇతర వ్యక్తుల గురించి, ఎవరో చేసిన నిర్ణయాలను ఆమోదించవద్దు. ఒక వ్యక్తి మహా పొగరుబోతని ఎవరైనా చెబితే, అది మీరు, విశ్వసించనవసరం లేదు. మీరు ఆ వ్యక్తితో కలిసి సంభాషించిన తరువాత, అతనెటువంటివాడో నిర్ణయించుకోవచ్చు. అలాగే మీకు గర్వమెక్కువ అని, కోపమెక్కువ అని ఎవరైనా చెబితే అది వాస్తవం కాదని వివరించండి.

## అధికులెవరు? అల్పులెవరు? అందరు మనవంటివారే!

గొప్ప తెలివితేటలు, ఆకర్షణీయమైన రూపం, సంపద, క్రీడానైపుణ్యం, సృజనాత్మక శక్తి, పేరు ప్రఖ్యాతులు వున్నవారు ఇతరులకంటే గొప్పవారని, ఇవేమీ లేకపోతే, ఆనందంగా వుండడం ఎలా సాధ్యమవుతుందని, ఇవి వున్నవారినే ఇతరులంతా గౌరవిస్తారని మీరు భావిస్తున్నారా? ఇవన్నీ పొరపాటు అభిప్రాయాలు.

కొందరికి ఒకటి రెండురంగాలలో మంచి ప్రావీణ్యత ఉండవచ్చు. ఈ కారణంగా వారు ఇతరులకంటే ఉన్నతులని నిర్ణయించడం తప్పు. ప్రతి ఒక్కరికీ ఏవో కొన్ని లోపాలు, పరిమితులు, బలహీనతలు వుంటాయి. ఉన్నత పదవులలో వున్నవారుకాని, సినీతారలుకాని, క్రీడాకారులుకాని, పేరుప్రఖ్యాతులున్న రచయితలు, వైద్యులుకాని మిగిలిన వారందరికంటే ఉన్నతులని, భావించడం తప్పు. కొందరు అధికులు, మిగిలినవారు అల్పులు అనే ఆలోచన తప్పు. మీరు గొప్పవారమని అనుకోవడం ఎంత తప్పో - అలాగే ఇతరులకంటే తక్కువవారమనుకోవడం అంతే తప్పు. మీరు అధికులమనుకొన్నా, కాదనుకొన్నా - అది మీకెంతో హాని చేస్తుంది. తాము అధికులమని విర్రవీగే వ్యక్తులు ఇతరుల నుండి ఏమి నేర్చుకోవడానికీ ప్రయత్నించలేరు. ఫలితంగా జీవన పోరాటంలో వెనుకపడిపోతారు.

మీరు, మీకంటే అధికుడని భావిస్తున్న వ్యక్తితో కలసివున్నప్పుడు, ఏవో కొన్ని రంగాలలో, మీకంటే అతితక్కువ నైపుణ్యం వున్నంతటి మాత్రాన, మీకంటే అతను అధికుడు కాదని, మీకు మీరు ఒకటికి పదిసార్లు గుర్తుచేసుకోండి. మీరు మీకంటే అధికులని కాని, తక్కువవారని కాని భావించే వ్యక్తులలో, మీకు నచ్చే లక్షణాలేమయినా వున్నాయేమో గమనించండి. వాటిని మీ నోట్ బుక్ లో పదిలపరచండి. అలాగే, మీరు, మీకంటే అధికులని భావించే వ్యక్తులను, కలవడానికి సంకోచించవద్దు. వీలయినన్ని ఎక్కువసార్లు, అటువంటి వ్యక్తులను కలవండి. వివిధ విషయాలను గురించి, వారితో చర్చించండి. మీ అభిప్రాయాలను, నిర్దిష్టంగా తెలియపర్చండి. ఇలా, వారానికి ఎన్నిసార్లు కలవగల్గుతున్నారో, మీ

నోట్‌బుక్‌లో వ్రాసుకోండి. అలాగే, మీలో అల్పత్వ భావన చెలరేగిన ప్రతి సందర్భాన్ని, మీ నోట్‌బుక్‌లో గుర్తించండి.

నేటి సమాజంలో వున్నవారందరినీ మంచివారు - చెడ్డవారుగా, నిజాయితీపరులు - అవినీతిపరులుగా, విభజించవచ్చని అనుకొంటున్నారా? ప్రతి పనినీ మంచిదనో, చెడ్డదనో చెప్పవచ్చునని అనుకొంటున్నారా? ఇది తప్పు.

## ఈ విస్తృత ప్రపంచాన్నంతటినీ మంచిచెడుల విభజనలోకి కుదించవద్దు!

ఈ ప్రపంచంలో, ప్రతి ఒక్కరినీ, ఏదో ఒక మూసలోకి త్రోసివేయడం, ఈ ప్రపంచాన్నంతటినీ, రెండుగా విభజించి వేయడం సబబుకాదు. మీరు, ఎవరినైనా ఆకర్షణీయమైన వ్యక్తి అని, లేక కురూపిఅని అభివర్ణించడం తప్పు. అలాగే మంచివాడని, పిచ్చివాడని అనడం తప్పు. మనలో అత్యధికులను, మంచివారు లేక చెడ్డవారు అని, నిర్ణయించలేము. ప్రతి ఒక్కరూ, ఈ రెండు భిన్న ధృవాలకు మధ్యే, వుంటారు. అలాగే అందం, కురూపితనం కూడా! మనతోటి వ్యక్తులను, ఏదో ఒక ధృవానికి చెందినవారుగా పేర్కొనడం తప్పు. ఏ ఒక్కరిలోను, ఏ లక్షణమూ, పుస్తకాలలో చదివినంతటి పరిపూర్ణంగా వుండదు. ప్రతి ఒక్కరిలోను, వివిధ లక్షణాల మేళవింపును మనం గమనించవచ్చు. ఎవరెవరిలో, ఏయే లక్షణాలు, ఏయే మోతాదులో వున్నాయో మాత్రమే, మనం గమనించాలి. అంతే తప్ప వారిలో ఏదో ఒక లక్షణమే మూర్తీభవించి వుందనుకోవడం పొరపాటు.

ఇంతవరకూ, మీరు చుట్టూ వున్నవారిని, రెండు భిన్న ధృవాలకు చెందినవారిగా విభజించుతుంటే, ఇప్పుడు అలా ఆలోచించినప్పుడల్లా, మీ నోట్‌బుక్‌లో గుర్తుపెట్టుకోండి. అలాగే, మీ మిత్రులు, ఈ రకమైన ఆలోచనా ధోరణిని ఆదరిస్తుంటే వారిని సరిదిద్దడానికి ప్రయత్నించండి.

## ఇతరులు తక్కువగా అంచనా వేస్తారేమోనని, మిమ్మల్ని మీరు సాధించుకోవద్దు

మీరేం సాధించారన్న అంశంపైనే, మీ సామర్థ్యం ఆధారపడి ఉంటుందని, మీరేమీ సాధించలేకపోతే, ఇతరులు మిమ్మల్ని తక్కువగా అంచనా వేస్తారని, ఇతరులు మిమ్మల్ని ఎలా పరిగణిస్తున్నారన్నది అత్యంత ప్రధానమని, మీరేదయినా సాధించగలిగినప్పుడే, చుట్టూవున్నవారు మీరంటే ఇష్టపడతారని, మిమ్మల్ని గౌరవిస్తారని మీరనుకొంటున్నారా?

మిమ్మల్ని, ఇతరులెలా అంచనా వేస్తున్నారోనని, మీరు నిరంతరం మథనపడడం మానివేస్తే, మీరే పనినైనా, స్వేచ్ఛగా, మనస్సును లగ్నంచేసి చేయగలుగుతారు. ఏదో సాధించి, మన సామర్థ్యాన్ని, పదిమందికీ వెల్లడిచేయాలని మథనపడడం వలన, సాధించడం సంగతెలావున్నా, మనం నిరంతరం ఆందోళనకు లోనుకావడం, జరుగుతుంది. మీకు ముఖ్యులైన వ్యక్తులు కొంతమంది తప్ప, మిగిలిన వారందరూ, మిమ్మల్ని గురించి ఏమనుకొంటున్నారన్నది, అంతటి ప్రధాన విషయంకాదు. తోటివారిని గురించి చులకనగా మాట్లాడే వ్యక్తులు ఎప్పుడూ వుంటూనే వుంటారు. అటువంటివారు మిమ్మల్ని ఎలా అంచనా వేసినా మీరు ఖాతరుచేయనవసరం లేదు.

మీరు ఏ పనిచేస్తున్నా ఇతరులేమనుకొంటున్నారోనని, అనుకొంటున్న సందర్భాలెన్ని వుంటున్నాయో, గుర్తించండి. వీటిని మీ నోట్‌బుక్‌లో వ్రాసుకోండి. మీరు చేసే పనిమీదే మీ మనస్సును

లగ్నం చేయండి. అంతే తప్ప ఇది ఎలా చేయగల్గుతున్నామని ఆలోచించవద్దు. ఆ తరువాత ఫలానా పనిని ఎలా చేస్తున్నామనే తప్ప, దీనిని గురించి ఇతరులేమనుకొంటారోనని ఆలోచించవద్దు. అలాగే, ఇతరుల వ్యాఖ్యానాలకు భయపడి, మీరు చేయదలచుకొన్న పనిని చేయకుండా వుండవద్దు.

ఒక ప్రముఖ రాజకీయ నాయకుడు, ఒక వాణిజ్యవేత్త, ఒక ప్రముఖ వైద్యుడు, ఒక మేధావి, ఏ అంశంపైన అయినా తమతమ అభిప్రాయాలు వెల్లడిస్తుంటే, అవన్నీ సరైన అభిప్రాయాలనే అనుకొంటున్నారా? అలాగే, ఎవరైనా మీకు రహస్యంగా ఏదైనా చెబితే, ఆ విషయాన్ని విశ్వసించవచ్చుననుకొంటున్నారా? మీకేమైనా విపరీతమైన ఆలోచనలు కలిగితే, మీరు మానసిక సమస్థితిని కోల్పోతున్నారని, భయపడతారా? ఇవన్నీ పొరపాటు అభిప్రాయాలు.

## ఎవరు చెప్పారన్నదికాదు, ఏం చెప్పారన్నదే ప్రధానం!

ఇతరులెవరైనా తమ అభిప్రాయాన్ని ప్రకటించితే, మీరు, దాన్ని ప్రశ్నించకుండా ఆమోదించనవసరం లేదు. వారు పొరపాటు పడడానికి అవకాశం లేనట్లే, పొరబడడానికి సైతం అంతే అవకాశముంది. వారు ఎంతటి ఉన్నత స్థితిలోవున్నా వారు కూడా మీవంటి వ్యక్తులే! మిమ్మల్ని గురించి ఇతరులేమన్నా, మీరు పట్టించుకో నవసరం లేదు. ఎవరైనా మిమ్మల్ని నిందించితే, మీరు ఆగ్రహోదగ్రులవుతుంటే, మిమ్మల్ని నిందించిన వారికి, వారి వ్యాఖ్యానాలకు, మీరు అత్యధిక విలువ ఇస్తున్నారనుకోవాలి. మీ అభిప్రాయాలకు, మీ అనుభవానికి విరుద్ధమైన విషయాన్ని, ఎవరైనా చెబుతుంటే, వారిని ప్రశ్నించే పూర్తి అధికారం మీకు వుంది. ఎవరు చెబుతున్నారన్నది ప్రధానం కాదు. ఏం చెబుతున్నారన్నదే ప్రధానం. ఎవరు చెప్పారనే విషయాన్ని ప్రక్కనపెట్టి, వారు చెప్పిన విషయాన్నే సమీక్షించండి.

మిమ్మల్ని ఎవరైనా నిందించుతున్నా, మిమ్మల్ని గురించి వ్యాఖ్యానించుతున్నా, మీరు నిశ్శబ్దంగా ఊరకుండిపోయిన సంఘటనలను మీ నోట్ బుక్ లో వ్రాసుకోండి. ఇటువంటి సన్నివేశం తిరిగి తలెత్తితే, మీరెలా ప్రవర్తించాలో ఆలోచించుకోండి. మీరు అందరి అభిప్రాయాలను తెలుసుకోవడం ఎంతో అవసరమే! కాని ఏ అభిప్రాయానికెంతటి విలువ ఇవ్వాలి, దేన్ని అనుసరించాలి, అన్నది కేవలం మీకై మీరు నిర్ణయించుకోవలసిన విషయం. వాళ్ళకన్నీ తెలుసు, వాళ్ళేం చెబితే అది వినాలన్న ఆలోచన, చాలా తప్పు. మీరు, ఎవరి అభిప్రాయాలను మరో ఆలోచన లేకుండా విశ్వసిస్తున్నారో, ఒక్కసారి గుర్తుచేసుకోండి. అటువంటి వ్యక్తుల పేర్లన్నీ మీ నోట్ బుక్ లో వ్రాసుకోండి. వారు ఇకపై చెప్పేవన్నీ ఒకటికి రెండుసార్లు సమీక్షించి ఆమోదించాలని నిర్ణయించుకోండి.

మీ నోట్ బుక్ దగ్గర పెట్టుకొని గత పదిరోజులుగా మీరు గుర్తించిన అంశాలన్నిటినీ ఓసారి పునఃసమీక్ష చేసుకోండి. ఇకనుండి ప్రతిరోజూ నోట్ బుక్ ను ముందుగా తిరగవేయడం అలవాటు చేసుకోండి. నోట్ బుక్ లోని, ఇంతవరకూ గడచిన, పది పేజీలలోను క్రొత్తగా చేర్చవలసినదేమైనా వుందేమో ఒకటికి పదిసార్లు ఆలోచించండి. ★

# ఋగ్వేదంలో - స్త్రీలు

- ప్రొఫెసర్ పి.ఎస్. శాస్త్రి

ఋగ్వేద సూక్తాలను అర్థం చేసుకొనటానికి స్కందస్వామి, రాఘవభట్ట, మాధవ, సాయణ, పృథ్వీధరుల భాష్యాలున్నై. 'విశ్వస్మాదింద్ర ఉత్తరః' (10.86) మొదలైనవి బృందగీతాలు (కోరస్)గా కన్పించగలవు. సంవాద సూక్తాలు, ఉషస్సూక్తాలు మొదలైన వాటిని పరిశీలిస్తే ఋగ్వేద సూక్తాలను సాహిత్య దృష్టితో చూసితీరాలనిపిస్తుంది. కవిత్వ హృదయాన్ని విస్మరించేవారు, ఆహృదయం లేనివారు ఈ సూక్తాల నర్థం చేసుకోలేరని మా సిద్ధాంతం.

ఉతత్వఃపశ్యన్ నదదర్శ వాచం - ఉతత్వః శృణ్వన్ నశృణోత్యేనాం
ఉతోత్వస్మై తనం విసస్రే - జాయేవ పత్య ఉశతీసువాసాః (10-71-4)

అను ఋక్కు నాధారంగా తీసికొని దాదాపు అర్ధశతాబ్దానికి పూర్వమే ఋగ్వేద ఋషులు ధ్వనివాదమును స్థాపించిరని వివరించాము. శ్రీ పి.వి. కాణేగారు తమ అలంకార చరిత్రలో మావాదాన్ని ఉదాహరించి, సమర్థించారు. కేవలం అభిధావృత్తితో ఋగ్వేద సూక్తాలకర్థం చెప్పరాదు.

మే 1994 'మిసిమి' సంచికలో ఆరుద్రగారి వ్యాసం చదివి, వారు కవులని ఊహించలేకపోయినాను. ఒక కవి ఇతర కవులనర్థం చేసుకొనటానికి అభిధావృత్తిని (primary denotation) మాత్రమే ఆశ్రయించడు. అలా ఆశ్రయించిన వారిని గూర్చే 'పాండిత్యాహీనాః కవయో భవంతి' అన్నారు.

శ్రీ ఆరుద్రగారికి కవి హృదయం లుప్తమైందనటానికి వారు ఉదహరించిన ఋక్కును పరిశీలించండి.

పరాశుభ్ర అయాసో యవ్యా సాధారణ్యేవ మరుతో మిమిక్షుః
వ రోదసీ అపనుదంత ఘోరా జుషన్త వృధం సఖ్యాయ దేవాః (1-167-4).

ఇది, అగస్త్యుడు మరుత్తుల నుద్దేశించి పల్కిన ఋక్. అనేక మరుత్తులకు రోదసి అనే ఒకే భార్య ఉన్నదని శ్రీ ఆరుద్ర ఉవాచ. రోదసి ఎవరు? స్త్రీ లింగశబ్దం గనక స్త్రీ అని భ్రమపడ్డారు కవిగారు. ద్యావాపృథివీలను కలిపితే వచ్చే అర్థం రోదసి. ద్యౌః అనేదే గ్రీక్‌భాషలో Zeus ఐనది. ద్యౌఃపితరౌ అనేది లాటిన్‌లో జుపిటరైంది. స్త్రీ లింగం లేదు. కవిగారికి ఉత్ప్రేక్షలంకారం తెలుసా? ''విసూర్యో రోదసీ చక్షసావః (7-79-2) అని ఋగ్వేదం. 'ఆనోవహ రోదసీ దేవపుత్రే'' (10-11-9, 10-12-9) అని చాలా వాక్యాలున్నై. ఆధునిక కవిగారికి అభిధావృత్తియే పరమార్థమా? ఋగ్వేద కవులకు అలంకారములు తెలియవా? 'న' అనే శబ్దమునకు 'ఇవ' అనే అర్థమున్నదని వీరికి తెలుసా? బ్రహ్మ, సూత్రభాష్యంలో శంకరులు కూడా ఈ అర్థమున్నదని చెప్పారండీ. మరుద్గణాల కధిపతి బృహస్పతి అని బృహస్పతి నుద్దేశించిన సూక్తంలో 'గణానాం త్వాగణపతి హవామహే' (2-23-1) అని ఉన్నది.

1-167-5 ఋక్కును ఉదాహరించి ఇదే తప్పు వ్యాఖ్యను చేశారు. 'సంగమంకొరకు' అనే అర్థం ఎక్కడున్నది. ఓల్డెన్‌బెర్గ్, లుడ్విగ్, గెల్డ్నర్‌ల వ్యాఖ్యలు మన కవిగారికి తెలియవు. సాయణ భాష్యంలో కన్పించే అలంకారికార్థం వీరికి తెలియదు. గుంపు పెళ్ళి నాకు తెలిసినంతవరకు ఋగ్వేదంలో లేదు. 1939 నుండి 1951 వరకు ఋగ్వేద పరిశోధనలో ఉన్నాను. 1988లో ఋగ్వేదంమీద ఆంగ్లంలో పుస్తకాన్ని ప్రచురించాను గనుక అధికారికంగా ఈ వేదంమీద మాట్లాడగలను.

అగస్త్యుడు మైత్రావరుణి. ఊర్వశిని గురించి వ్రాసేముందు ఊర్వశీ పురూరవ సంవాదాన్ని (10-95), మహాకవి నాటకాన్ని చదివితే బాగుండేది. ఐదు సోదర వర్గాలను ఆరుద్ర సృష్టించారు. వీరందరు అనార్యులన్నారు. అనార్యులెవరండీ 'యస్యేమే హిమవంత మహిత్వా' (10-121-4) అని ఋగ్వేదంలో ఒకే ఒక్కసారి హిమవంతుని స్మరణ ఉన్నదండీ. అష్టమ మండలంలో, ఉన్న ఇరింబిఠి, సిరింభిరి, కణ్వ, ప్రస్కణ్వ, నారద, పర్వతాది ఋషులార్యులా? అనార్యులా? పాశ్చాత్యులు సృష్టించిన భేదమిది.

ఆదిత్య గణాలు 12 అన్నారు. 'అష్టౌపుత్రాసో అదితేః' (10-72-8) అని ఋగ్వేదం.

అమాజూ (10-39-3, 2-17-7) అంటే Maiden aunts. పెళ్ళి లేకుండా తండ్రి ఇంటిలో ఉండేవారు. కాని 1-117-7లో దైవకృప వలన అలాంటి స్త్రీకి భర్త లభించాడు. దురోణీ, పితృషదేశబ్దాలకు విచిత్రార్థాల నిచ్చారు. 8-91-5,6 ఋక్కులకు అర్థాలు అనర్థాలు. 'నా మర్మతల' మనే అర్థాన్ని ఆరుద్రగారు కల్పించారా? వారనుసరించిన అనువాదకులు సృష్టించారు. రోమాలు సస్యానికి సంకేతమన్నారు ఆధునిక కవులు.

సర్వాహమస్మి రోమశాగంధారీణి మిహనికా (1-126-7) అని ఋగ్వేదం. గంధార నగరంలోని గొర్రెలాగా ఆమె శరీరమంతా రోమాలతో నిండినది అని దాని అర్థము.

ఇక అభ్రాత శబ్దమున్న ఋక్కు నుదహరించి ఆనాటి సాంఘిక మర్యాదను తెలుసుకోమన్నారు. కులపా అనే వ్యవస్థ ఋగ్వేదంలో ఉన్నదంటూ అథర్వవేద వాక్యాన్ని సూచించారు. ఇది నేటి పరిశోధన అని ఇప్పుడు తెలుసుకుంటున్నాము.

ఈ క్రింది ఋక్కులను చూడండి. మొదటిదానిని ఆరుద్రగారు ఉదహరించి చాలా అపార్థాలకు దారిచూపారు.

అభ్రాతేవ పుంస ఏతి ప్రతీచీ గర్తారుగివ సనయే ధనానాం
జాయేవ పత్య ఉశతీ సువాసా ఉషాహస్రేవ ని రిణీతే అప్సః (ఋ - 1-124-7).

అభ్రాత రోనయోష ణోవ్యంతః పతిరిపోన జనయోదురేవాః
పాపాసః సంతో అనృతా అసత్యా ఇదంపదమ జనతా గభీరం (4-5-5)

అభ్రాతృవ్యో అనాత్వ మనాపిరింద్ర జనుషాసనాదసి
యుధేదాపిత్వ మిచ్ఛసే (8-21-13).

సోదరులు లేని దానిలాగా ధనలాభానికి వేదిక నధిరోహించి మగవాని కొరకు ఉషః కన్య పోతున్నది. పతిని కోరుకుంటూ మగనికోసం మంచి గుడ్డలను ధరించిన స్త్రీ వలె పోతున్నది (1-121-7). సోదరులు లేని స్త్రీకి ఆనాడు వివాహమయేది కాదు. ఇప్పటికీ కొందరు ఛాందసులు సోదరుడు లేని పిల్లను కోడలుగా తెచ్చుకొనమని అంటున్నారు. అట్టి స్త్రీలలో కొందరు బ్రహ్మవాదినులైనారు. ఇతరులు పడుపు వృత్తిని అవలంబించేవారు. మగ సంతతిలేని తండ్రికి వారసుడిని (దౌహిత్రుని) ఇచ్చే కుమార్తెను పుత్రిక అంటారు.

అపుత్రో అనే విధినా సుతాం కుర్వీత పుత్రికాం
యదపత్యం భవేదస్యాం తన్మమస్యాత్యస్వధాకరం

అని శాస్త్రము. స్వంత కుమార్తెనే (సుతాం) ఇట్టి పరిస్థితులలో పుత్రిక అన్నారు. దుహిత అనిపించుకోక పుత్రిక అని అనిపించుకునేది అని వ్యాఖ్య చేయటం శాస్త్రరూపం.

సోదరులు లేని స్త్రీలవలె పతిని శత్రువుగా భావించే ఈ స్త్రీలు పాపులు, అసత్యవాదినులు,

అనృతవర్తనులు (4-4-5). సోదరులు లేని (కొందరు) స్త్రీలు జారిణులుగా ఉండేవారని స్పష్టము.

వేదకాలం నాటి సామాజిక పరిస్థితులకుపైన ఇచ్చిన 1-124-7ను అన్వయించుకోవాలని ఆరుద్ర ఉవాచ. పాపము శమించుగాక.

ఉచ్ఛ్వాయ్యఖ్య ద్యువతిః పునర్భూరోషా అగన్ ప్రథమాపూర్వహూతౌ అని ఉషస్సును ద్వితీయ వివాహం చేసుకున్న యువతిగా చెప్పారు. (1-123-2). అవివాహితవైన కన్యలాగా ఉన్నదని ఇదే సూక్తంలో అన్నారు.

కన్యేవ తన్వా శాశదానాగ్ం ఏషిదేవి దేవమియక్షమాణం
సంస్మయమానా యువతిః పురస్తాదావిర్వక్షాం సి కృణువే విభాతీ (1-123-10).

ఉషోదేవి దేవునికోరుచూ, నవ్వుచూ, ఆయన కెదురుగా తన వక్షస్సును బహిర్గతం చేసినట్లున్నదని భావము.

అధి పేశాంసివ పతే నృతూరి వాపోర్ణుతేవక్ష ఉస్రేవ బర్జహం (1-92-4). నర్తకివలె ఉషస్సు చక్కని వస్త్రాభరణాలతో వచ్చి వృషభం వలె తన వక్షస్సును చూపుతున్నదని భావము. ''యోషా జారస్య చక్షసానిభాతి' అని (1-92-11) ఇదే సూక్తంలో జారశబ్దమును (సోదరులు లేని) ఉషస్సుకు సంబంధించినట్లు చెప్పినారు.

యతఃపరిజార ఇవాచరంత్యుషో దదృక్షేన పునర్యతీవ (7-76-3). సూర్యుని విషయమున ఉషస్సు జారిణిలాగా ఉన్నది. యతివలె లేదు. కాని మరొక చోట 'అభిపశ్యంతీ వయునా జనానాం దివోదుహితా భువనస్యపత్నీ' (7-75-4) అని ఉన్నది. 'దివోదుహితా, భువనస్యపత్నీ' అంటే ఆరుద్రగారు రోదసిలాగా ఉషస్సుకు కూడా చాలామంది భర్తలున్నారని సెలవిస్తారు. సాంకేతికార్థాలను గుర్తుంచుకోవాలి. పిషెర్, గెల్డ్నర్‌లు vedische studien అని మూడు సంపుటాలు ప్రచురించారు. వాటిని చదివే శక్తి సామర్థ్యా లీ కవిగారికి చేకూరగలవా?

మరొకవైపు దశమ మండలంలో 102వ సూక్తాన్ని చూడండి. యుద్ధానికి పోతున్న ముద్గలుని రథాన్ని అతని భార్య నడిపింది. 'ఉతాహమస్మి వీరిణీ ఇంద్రపత్నీ మరుత్సఖా' (10-86-9) అన్నది ఇంద్రుని భార్య.

అన్యామిచ్ఛ పితృషదం వ్యక్తాం నతేఖా గోజనుషేరస్యవిద్ధి (10-85-21) అని వివాహ సూక్తంలో ఉన్నది. తండ్రి ఇంటిలో ఉండి వ్యక్తురాలైన మరొక స్త్రీని కోరుకొమ్మని తాత్పర్యం. ఆనాడు వ్యక్తురాండ్రైన స్త్రీలు తమ తమ భర్తలను వెదుక్కొని పెళ్ళిళ్ళు చేసుకునే వారనటానికి ఈ క్రింది ఋక్ చాలు.

భద్రా వధూర్భవతి యత్సుపేశాః
స్వయం సామిత్రం వనుతేజనేచిత్ (10-27-12)

చక్కని వస్త్రాలను ధరించి స్వయంగా భర్తను ఎన్నుకుని చేసుకున్న యువతి 'భద్రావధూః'. ఆనాటి సమాజమొకే మార్గంలో నడవలేదని చెప్పటానికే ఈ వ్యాసం. ఇప్పటికైనా కవులు, సమీక్షకులు అలెగ్జాండర్ పోప్ చెప్పిన 'Where angels fear to tread' అనే సూక్తిని రుజువు చేసుకోరని మా తాపత్రయం. ★

# క్రిస్టొఫర్ కాడ్వెల్ - మార్క్సిజం

- శివలింగం

మార్క్సిస్టుల్లో మహానుభావులుంటారు. అటువంటివాడు క్రిస్టొఫర్ కాడ్వెల్. 20 అక్టోబరు 1907లో జననం. కాడ్వెల్ ప్రజాస్వామ్యాన్ని స్వాతంత్ర్యాన్ని అభిమానించే కమ్యూనిస్టు. అందుకేనేమో బ్రిటిషు కమ్యూనిస్టులంటే లెనిన్‌కు మంట అంటారు. కార్మికులు సమ్మెలో పోలీసువాళ్ళతో పేకాడుతున్నట్టు ఫొటో చూపించారట. అంతటితో నిధులు పంపడం నిలిపేశాడు. కాడ్వెల్‌లో ఉన్న ఈ ఉదారస్వభావం, స్వేచ్ఛాప్రియత్వం పలువురు కమ్యూనిస్టు రచయితలకు కంటకింపయింది. ఆలోచనకూ ఆచరణకూ పొత్తుకుదరని కమ్యూనిస్టులెందరో ఉన్నారు. కార్మిక, కర్షక పీడితప్రజావళికి నివాళిపట్టే కమ్యూనిస్టులు సంపన్న ప్రదేశాల్లో ఆకాశహర్మ్యాల్లో నివసిస్తుంటారు. అటువంటివారినే affluent Marxists or air conditioned Marxists అంటారు. కాని కాడ్వెల్ క్రియాశీలి. కార్యోత్సాహి. 1936 ప్రాంతంలో స్పెయిన్‌లో ప్రజాస్వామ్యాన్ని హతమార్చి సైనికాధికారులకు పట్టం కట్టాలని హిట్లర్, ముసోలినీలు విమానాలు ఆయుధాలు సేనలు పంపారు. స్వేచ్ఛాప్రియులు, ప్రజాస్వామ్యవాదులు స్పెయిన్ ప్రజారాజ్యానికి పూర్తిసహాయసహకారాలందించారు. ఈ రోజు మనం సహాయపడకపోతే, పోరాటంలో విఫలమైతే రేపు మన పరిస్థితీ అంతే. అందుకే పోరాటంలో పాల్గొనడమే కర్తవ్యమన్నాడు 'కాడ్వెల్'. స్పెయిన్ సివిల్‌వార్‌లో 12 ఫిబ్రవరి 1937న ముప్పయి సంవత్సరాల వయసులో యుద్ధంలో మరణించాడు. ప్రజాస్వామ్య స్వాతంత్ర్యానికి ప్రమాదకరమైన శత్రువులు కమ్యూనిస్టులని అనుకునేవారు. ఒకవేళ కమ్యూనిస్టులు గనుక ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్యం అన్నారంటే అందులో పచ్చిమోసం ఉందని భావించేవారు. కాని కాడ్వెల్ నిజమైన కమ్యూనిస్టు. ప్రజాస్వామ్యాన్ని స్వాతంత్ర్యాన్ని అభిమానించడమే కాదు వాటి కోసం ప్రాణాలనైనా త్యాగం చేయగల కమ్యూనిస్టు. ఆంగ్లేయులు చాలామంది స్పెయిన్ యుద్ధంలో ప్రాణాలర్పించారు. అప్పటికే కాడ్వెల్ అంతగా ప్రాచుర్యం పొందని గ్రంథాలు రచించాడు. స్పెయిన్‌కు వెళ్ళే సమయానికి ఇల్యూషన్ అండ్ రియాలిటీ అచ్చులో ఉంది. ముఖ్యమైన గ్రంథాలు మరణించిన తరవాత వెలువడినవే.

ఇల్యూషన్ అండ్ రియాలిటీ - 1937
స్టడీస్ ఇన్ ఎ డైయింగ్ కల్చర్ - 1938
పోయమ్స్ అండ్ క్రైసిస్ ఇన్ ఫిజిక్సు - 1939
ఫర్దర్ స్టడీస్ ఇన్ ఎ డైయింగ్ కల్చర్ - 1949

ఆయన రచనల్లో ఆలోచనా ఆచరణ కలిసిపోతాయి. పోరు అంచున నిలబడి కల కనడు. ఆలోచనారహితంగా పోరాటంలో మునిగిపోడు. మృత సంస్కృతిని గురించి రెండు గ్రంథాలు రచించాడు. జార్జి బెర్నార్డ్‌షా, టి.ఇ. లారెన్సు, డి.హెచ్. లారెన్స్, హెచ్.జి. వెల్స్, శాంతి-హింస, ప్రేమ, ఫ్రాయిడ్ , స్వాతంత్ర్యం విషయాల మీద మొదటి గ్రంథంలోనూ అసంతృప్తి, సౌందర్యం, అలంకారశాస్త్రం, మానవుడు-ప్రకృతి, చైతన్యం, వాస్తవికతలను చర్చించాడు రెండో గ్రంథంలో. అంత చిన్న వయస్సులో గంభీరమైన విషయాలను గురించి చర్చించి గుణదోష నిర్ణయం చేయడం అంత సామాన్య విషయం కాదు. ఆనాటికే అంత

ప్రావీణ్యాన్ని సంపాదించాడు. డి.హెచ్. లారెన్స్ కూడా 'the social instincts run deeper than the sexual instincts in man' అన్నారు.

విషయాలలో భిన్నత్వం కనిపిస్తున్నా అంతసూత్రం తెగదు. ద్వారం మూయడు. తనకిష్టం వచ్చిన రీతిలో వ్రాయడమే స్వాతంత్రం. 'బ్యూటీ' గురించి రాసిన వ్యాసం. చాలా క్లిష్టంగా ఉండి అంతత్వరగా అర్థం కాదు. బూర్జువా సమాజంలో శ్రామిక సౌందర్యానికి విలువలేదని ధనమే సుందర వస్తువని వివరిస్తాడు. సమాజం సుశిక్షితగతిలోనే సౌందర్యం వుందని ఆ గతి శ్రమ వల్లనే సాధ్యం కనుక శ్రమే సౌందర్యం అన్నాడు. సత్యం, సౌందర్యం సమాజలక్ష్యాలు కావు. అవి ఆంతరంగిక లక్ష్యాలు మాత్రమే. సంపన్నమైన సంకీర్ణవాస్తవికతా ధార నుండి ఉద్భవించే భావాలన్నాడు. మార్క్సిస్టు దృక్పథంలో సర్వకళలూ ఆత్మకళలే. ఆర్థర్ కోస్లర్, రిచర్డు రైట్, లూయీఫిషర్, ఇగ్నేషియోసైలోన్, ఆండ్రీజీడ్, స్టీఫెన్ స్పెండరు వంటి మేధావులూ, కవులూ కమ్యూనిస్టు పార్టీలో 1930 ప్రాంతాల్లో చేరినవారే. కమ్యూనిస్టు పార్టీలో నిజం పోయి ఇజం మిగిలిందని తెలుసుకుని వదిలేశారు. '(కమ్యూనిస్టు) దేవుడు విఫలుడు' గ్రంథం కూడా వచ్చింది. మార్క్సిజం వేరు. మార్క్స్ భావాలు వేరు. సాహిత్యం, కవిత్వం, కళలు గురించి మార్క్స్, ఎంగెల్స్ భావాలు వారు చదివిన ఉత్తమ గ్రంథాలు ప్రచారం కోసం పనికొచ్చేవి కావు.

1930-40ని హంగ్రీ థర్టీస్ అంటారు. రెండో ప్రపంచ యుద్ధానికి స్పెయిన్ అంతస్స మరం పూర్వరంగం అనుకుంటే స్పెయిన్ యుద్ధానికి దారితీసిన అనేకానేక సంఘటనలే 'నవమానవ దర్శనకు పూర్వరంగం' అని ఆయనే చెప్పాడు. శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాలు చాలావరకు ఈ దశాబ్దంలో వెలువడ్డవే. కాడ్వెల్‌లోనూ హంగ్రీ థర్టీస్ ప్రభావం ఉంది. నిరుద్యోగం, ద్రవ్యోల్బణం, నిస్సహాయత, అనైక్యత, క్షామం, బూర్జువా సమాజంలో విలయతాండవం చేస్తున్న రోజులవి. వీటన్నిటికి పరిష్కారం చూపించింది ఒక్క మార్క్సిజ మేనని యువతరం విశ్వసించింది. ఎందరో మహానుభావులు మార్క్సిజం తీర్థం పుచ్చుకు న్నారు. అగ్నిలో దూకి శలభాల్లా మసైపోయారు. మార్క్సిజం ఆనాటి యువతరానికి మిలమిల మెరిసిపోతున్న తేజశ్శిఖరం.

కళ కళకోసం కాదని కళ సామాజిక ప్రయోజనం కోసమేనని, సామాజిక ప్రయోజనం కళలో ఉండి తీరాలని మార్క్సిస్టు విమర్శకులు నొక్కి వక్కాణించారు. కవిత్వం నినాదంగా ప్రచారాత్మకంగా తయారై శుష్క కవిత్వం వెలువడింది. టాల్‌స్టాయ్‌లో మత ప్రమేయం చోటుచేసుకోవడం వలన కళ ప్రబోధాత్మకంగా ఉండాలని, కళ పునర్నిర్మాణం జరగాలని ఉద్బోధించాడు. సౌందర్యం అంటే టాల్‌స్టాయ్‌కి pagan beauty (పాపాత్ములు కాంక్షించే తుచ్ఛ భౌతిక సౌందర్యం). టాల్‌స్టాయ్ శుద్ధకళావాద వ్యతిరేకి. 'మార్క్సిస్టు సాహిత్యంలో వాస్తవికవాదం వలన కళాత్మక విలువలు లుప్తమై, సౌందర్య విహీనమై ఉత్తమ సాహిత్యం కాలేకపోయింది. 1920-30 దశాబ్దంలో ఒకే మూసలో మార్క్సిస్టు విమర్శలు పాశ్చాత్య దేశాల్లో బయల్దేరాయి. గతితార్కిక, భౌతికవాద తాత్విక ప్రాతిపదికతో కళలో స్పష్టత, వాస్తవికత ఉండాలి. ముఖ్యమైన విషయాలు-వర్గ ప్రచారం, విప్లవ ప్రబోధ, కార్మిక నియం తృత్వ ఆదర్శ, ఆదేశిక సూత్రాలను చెప్పడం, కవుల కళాకారుల చరిత్రలో, కార్మిక, మధ్యతరగతి, నూడో బూర్జువా, రాజరికం గురించిన ఆర్థిక సామాజిక స్థాయిని వివరిం చడం... పార్టీ రచయితలు వ్రాయవలసినవి. రష్యా రచయితలు సోషలిస్టు, ప్లెఖనోవ్ 1912-13లో వ్రాసిన లిటరేచర్ అండ్ ఆర్ట్ (ఆంగ్లానువాదం 1936) ట్రాట్‌స్కీ వ్రాసిన లిటరేచర్ అండ్ రివొల్యూషన్ 1923 గ్రంథాలు ఆధునిక కవిత వాస్తవికత నుండి దూరమై

ఏకాకి అయిపోవడం గురించి తెలియజేశాయి. 1937లో ఇల్యూషన్ అండ్ రియాలిటీ గ్రంథంలో కాడ్వెల్ ఆంగ్ల సాహిత్యానికి అనువర్తింపచేశారు. సిద్ధాంత గ్రంథంగా మంచి పేరు తెచ్చుకున్న గ్రంథం.

ఉన్నతమైన ఉత్తమ సాహిత్యం వెలువడినప్పుడు కొన్ని కాలాల్లో ఆనాటి సామాజిక, ఆర్థిక పరిస్థితులతో ఆ సాహిత్యానికి ప్రత్యక్ష ప్రమేయం ఏమీలేదు. ఆనాటి వ్యవస్థ నిర్మాణంతో గాని, వస్తువు ఆధారం గాని లేదు. సామాజిక వాస్తవికత ఉండాలని లేదు. ఉండి తీరాలని శాసించడం నిరంకుశం. విప్లవానికి ముందు ప్రపంచాన్ని ఉర్రూతలూగించిన రష్యా సాహిత్యం విప్లవానంతరం ఎంత నిస్తేజంగా, నీరసంగా ఉందో అందరికీ తెలిసిందే. ఎంత నిరంకుశ వ్యవస్థ అయినా సోల్జనిత్సిన్, పాస్టర్‌నాక్, సఖరోవ్ వంటి వారు నిర్భయంగా ఎదిరించి నిలుస్తుంటారు. కనుక వాస్తవికత పేరుతో కవిత్వం వ్రాసి చెడ్డ పేరు తెచ్చుకోవడమే కాదు ఆ కవిత్వం, కవిత్వం కాకుండా పోయిందనేది గుర్తుంచుకోవాలి. సర్రియలిస్టులు సాంఘిక నియమాలను తెంచిపారేసి మంచి కవిత్వాన్ని వ్రాయగలిగారు. సర్రియలిజం బూర్జువా కవిత్వంగా మార్క్సిస్టులు పరగణించారు. మడికట్టుకొన్న సమాజంలో పాతవాటిని సమూలంగా పెకలించి నూతన రీతులకు పట్టం కట్టాలనే సంకల్పం సర్రియలిస్టులది. ఈ ఉద్యమం విఫలమయిందని కాడ్వెల్ అభిప్రాయపడ్డాడు కాని సర్రియలిజం ఈనాటివరకు బతికి బట్టకడుతూనే ఉంది. కవిత్వం వలన విప్లవం ఒక్కసారిగా పెల్లుబుకుతుందని కలకనడం వెర్రితనం. సివిల్ సందర్భంలో యూదుల ప్రాణాల్ని కాపాడమంటూ పద్యాలు రాసి ఫలితం లేకపోగా ప్రసిద్ధకవి ఆడెన్ అన్నాడట 'Not a poem of mine had saved a single jew from the gas chamber' అని. గాంధీగారొకసారి రవీంద్రునికి ఉత్తరం రాస్తూ ఆకలితో అలమటించే పేదలకు కబీరు గీతాలు కాదు కావలసింది, అవి వారి బాధను ఉపశమింపచేయ లేవు. వారికి కావలసింది పుష్టికరమైన ఆహారం అని. కవిత్వం ఏదో చేస్తుందని వారూహించడం వలన వచ్చిన చిక్కు. సద్యః ఫలితం ఆశించడం తప్పు. కరకు గుండెను ద్రవింపచేయడం కష్టం. కవిత్వం నిదానంగా, శాంతంగా గుండె గుండెనూ స్పృశిస్తూ, కరకు గుండెలను కూడా ద్రవింపచేస్తూనే వచ్చింది. రష్యాలో కవిత్వం వల్ల విప్లవం రాలేదు. ఆనాటి సామాజిక పరిస్థితులు, నిరాశానిస్పృహలు, పాలకవర్గంలో క్రూరత్వం వల్ల సరియైన నాయకత్వంతో ప్రజలు తిరగబడ్డారు. విజయం సాధించారు. రచనలు కూడా ఎంతగానో తోడ్పడినాయి.

సాహిత్యంలో ప్రతిబింబించేవి సాంఘిక సంబంధాలే అయినా అవి యథార్థంగా వ్యక్తం అయితే సాహిత్యం కళకాదు. బూర్జువా సమాజం ఆస్తికి ప్రాధాన్యం ఇచ్చింది. అయినా వ్యక్తిని విస్మరించలేదు. మార్క్సిస్టు సాహిత్యంలో వ్యక్తి కనబడడు. వ్యవస్థ కనిపిస్తుంది. ఆస్తి సంబంధమనేది మనిషికీ మనిషికీ ఉన్న సంబంధం కాదు. మనిషికీ వస్తువుకీ మధ్య ఉన్న సంబంధం అయినా ఇది ఒక భ్రమేనంటాడు కాడ్వెల్. కళను వ్యాపారవస్తువుగా బూర్జువా వర్గం మార్చిందని విమర్శించిన వారికి మార్క్సిస్టు వర్గం కళను ప్రచారవస్తువుగా మార్చుకున్న విషయం గుర్తురాదు. వ్యక్తి అనుభవం కళకు చోదకశక్తి అయినట్టే వస్తువు కూడా అయింది. సాంఘిక ప్రమేయం స్థానే వైయక్తిక ప్రమేయం కళాసర్వస్వంగా మారింది. వైయక్తికమైపోయిన అభిరుచులకూ సాంఘిక వాతావరణానికీ మధ్య జరిగే సంఘర్షణ నుంచి రూపానికీ వస్తువుకీ మధ్య జరిగే సంఘర్షణ నుంచి కొత్త కళ పుట్టుకొస్తుంది. కళాకారుడు మంచి కళాకారుడు అవశ్యం తన కళకు సంబంధించని విషయాలకు కూడా తన మనస్సును అర్పించుకోవలసి వస్తుంది. విప్లవాత్మక దశలో కళ ఇలా ప్రయోజనాత్మకం సందేశ భరితం కాక తప్పదంటాడు

కాడ్వెల్. బూర్జువా సమాజం తొలిదశలో మిథున శృంగారం వ్యక్తిస్వేచ్ఛావాదంతో కలిసినందువల్ల గాఢోద్రేకభరితం (Passionate love) కాగలిగింది. ఫ్యూడల్ సంస్కృతిలోని ఉదాత్తకాల్పనిక ప్రేమభావం (romantic love) ప్రాచీన గ్రీకు సంస్కృతిలోని ఇంద్రియానంద భావం (sensual) ఈ బూర్జువా ప్రేమభావంతో సంగమించినట్లు మరొక వ్యాసంలో కాడ్వెల్ పేర్కొన్నాడు.

సాహిత్యంలో తలెత్తిన కాల్పనికవాదం (Romanticism) సమాజం నుండి దూరమై స్వీయానుభూతిని వరించింది. సామాజిక వాస్తవికవాదం, స్వీయానుభూతి వదలి సమాజానికి అద్దం పట్టడం వలన సాహిత్యంలో కళాత్మకతపోయి ఎందుకట్టెలాగ ముడిపదార్థంలా తయారవుతుంది. మార్క్సిస్టు సాహిత్యవివేచనలో కళను జ్ఞానార్జన మార్గాల్లో ఒకటిగా పరిగణించడం ప్రధాన విషయమని సాహిత్యం ఆత్మకళగా మార్క్సిజం గుర్తించిందని కూలంకషంగా క్షోదక్షంగా పరిశీలించి చర్చించాడు శేషేంద్ర కవిసేన మేనిఫెస్టోలో.

మార్క్సిస్టుగా కళ మీదా జీవితం మీదా కాడ్వెల్ వెలిబుచ్చిన భావాలు కొందరికి అంగీకారయోగ్యమయితే మరికొందరికి పెడగా కనిపించాయి. బూర్జువా శాస్త్రాలుగా భావించే జెనెటిక్సు, సైకాలజీ, ఆంత్రోపాలజి వంటి సమకాలీన అభ్యమాన శాస్త్రాలపై కాడ్వెల్ కు ఉన్న అభిమానం వారికి నచ్చలేదు. ఇవన్నీ సమాజం ఉత్పత్తిచేసిన వస్తువులుగానే భావించాడు కాడ్వెల్. మార్క్సిజం సర్వరోగనివారిణి అనుకోలేదు. కాడ్వెల్ శైలిలో క్లిష్టత, అనిర్వచనీయతా లక్షణాలున్నాయని, స్వల్ప విషయాలకు అర్థంకాని పదాల ముసుగులు తొడిగి బూర్జువా భావజాల గందరగోళంలో పడేస్తాడని విమర్శించారు. ప్రసిద్ధ మార్క్సిస్టు సాహిత్య విమర్శకుడు రేమండ్ విలియమ్స్ కూడా కాడ్వెల్ ను ఉత్తమ మార్క్సిస్టు విమర్శకుడని ప్రశంసించాడు. 'a gifted synthesizer' అనీ One of the profoundest English Marxist critics' అనీ విమర్శకులు శ్లాఘించారు.

మానవ సహజ జ్ఞానానికి సామాజిక వాస్తవికతకు మధ్యగల గతితార్కిక సంబంధం కళలో ప్రతిబింబిస్తుంది. కళలో సమగ్రమై జీవితమే కనిపిస్తుంది. మార్క్స్ గతితార్కికాన్ని కళకు అన్వయపరచాడు కాడ్వెల్. అంతేకాదు శ్రమ విభజనను కూడా అన్వయించాడు. ఈ విషయంలో సమకాలీన మార్క్సిస్టు విమర్శకుల నుంచి అభిమానం చూరగొనలేకపోవడం వలన మనస్తత్వశాస్త్రవేత్త జంగ్ వైపు తిరిగాడు. బూర్జువా సమాజంలో ఉన్న వర్గభేదం పట్ల మార్క్స్ కు ఉన్న అసంతృప్తి జంగ్ కూ ఉంది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో పరిపూర్ణ వ్యక్తి అయిన మానవుడుగా రూపొందే సమాజాన్ని అభిలషించాడు. కళలో జంగ్ ప్రతిపాదించిన ప్రయోజనాన్ని స్వభావాన్ని వివరించడానికి జంగ్ ప్రతిపాదనలు బాగా ఉపయోగించుకున్నాడు కాడ్వెల్. మార్క్సిస్టు దృక్పథానికి జంగ్ అంతర్దృష్టి భంగం కలిగించలేదు. అమార్క్సీయమని భావించనూ లేదు. భౌతిక జీవితానికి ఆచరణకూ భిన్నం కాదు ఆలోచన అన్నాడు. మార్క్సిస్టు సౌందర్య సాంస్కృతిక రంగాలకు అమార్క్సీయ భావాలను సమన్వయపరచి విస్తృతం చేశాడు. వైయక్తికత జంగీయమే కాదు మార్క్సీయము కూడా. సామ్యవాద విప్లవ అంతిమ లక్ష్యం. వైయక్తికత, బూర్జువా సమాజంలో వర్గభేదం వలన వ్యక్తి పరిపూర్ణ వికాసం పొందలేదు. వర్గరహిత సమాజంలో వ్యక్తి అణగారిన కోరికలన్నిటినీ సమాజం తీర్చగలగడం వలన అవచేతనలో గుప్తంగా ఉన్నవన్నీ బహిర్గతం కావడం వలన వ్యక్తిపరిపూర్ణ వికాసం పొందడం వలన మొత్తం సమాజం సుసంపన్నమవుతుంది.

సహజప్రకృతిలో మనిషి మూగవాడుగా అమాయకుడుగా పుడతాడు. అన్నీ నేర్చుకోవలసిందే. అహేతుకంగా, ముడిపదార్థంగా ఉన్న మానవుడి మనసును కళ కవిత్వం నాజూకుగా

నాగరీకంగా మానవత్వం గల మనిషిగా రూపొందిస్తుంది. అనాటి జీవజన్య మనస్తత్వశాస్త్ర పరిశోధన ఫలితాల ఆధారంతో మానవుని సమస్యలను పరిష్కరించడానికి ప్రయత్నించాడు. బూర్జువా వాస్తవిక విజ్ఞానం బూటకం అని చాలాచోట్ల అన్నాడు. Illusion అనే పదం ఒకే అర్థంలో వాడలేదు. సామాజిక వాస్తవికతను గురించి బూర్జువా వర్గ భ్రాంతి, ఆదిమానవుని మిథ్యావాస్తవికత, కళలో కల్పన, ఫ్రాయిడ్ , మార్క్స్, అరిస్టాటిల్, ఆంత్రోపాలజి... వీరు కళమీద జీవితం మీదా వ్యక్తీకరించిన భావాల మాయ. కనుక Illusion పదాన్ని ఆయా సందర్భాన్ని బట్టి మనం అర్థం చేసుకోవాలి. కాడ్వెల్ వాణిలో మార్క్సిస్టు దృక్పథం మారుమోగుత్రూనే వుంటుంది. స్టాలిన్ క్రూరత్వం ఆయన పుస్తకాల్లో ఉందనీ, కల్పన-వాస్తవిక గ్రంథం సామ్యవాద వాస్తవికతకు దూరమైపోయిందని వాపోయారు విమర్శకులు. ఇది నిజం కాదు. మార్క్సిజంలో తాత్విక, రాజకీయ పరిష్కారమార్గం కనుగొనడమే కాదు, అతని శాస్త్రీయ కళాసాహిత్య విషయాలపై గల భావాలను సమన్వయపరచే ఒక జీవనతత్వం ఆయనకు గోచరించింది.

మార్క్సిజం ఆయనకు ఇనుప గోడల మధ్య బంధించబడింది కాదు. కాడ్వెల్ స్వేచ్ఛాప్రియుడు. ప్రజాస్వామ్యవాది. ఉదారసంప్రదాయవాది. ఇతర బూర్జువా శాస్త్రాలను ఆసరాచేసుకున్న మతమూఢత్వంలోకి గాని, వివాదాస్పద మనస్తత్వశాస్త్ర విషయాల జోతికిగాని రాజకీయాల్లోకి గాని పోలేదు.

కాడ్వెల్ లో ఉన్న అయిదు సూత్రాలు ఆయన వ్యక్తిత్వాన్ని అంచనావేయడానికి ఉపయోగపడతాయి.

1. మార్క్సిస్టు నియతివాదం - సమాజ ఆర్థిక పరిస్థితులే కళను నిబద్ధీకరిస్తాయి.
2. మార్క్స్ చారిత్రక దృక్పథాన్ని అంగీకరించాడు. గతితార్కికంగా చరిత్రలో మానవాభివృద్ధి చెందుతూ వచ్చింది. వర్గరహిత సమాజస్థాపన - సమానత్వం - సర్వతోముఖాభివృద్ధి.
3. సిద్ధాంతం - ఆచరణ - కళ-శాస్త్రం, ఆలోచన, ఆచరణ ఇవన్నీ ద్వంద్వాలు. కార్మికవర్గ విప్లవాత్మక చర్యవల్ల అన్ని ద్వంద్వాలను అధిగమించడం జరుగుతుంది
4. రూసో చెప్పిన బూర్జువా వాక్స్వాతంత్ర్యం కాదు. ఎంగెల్స్ చెప్పిన Freedom is the recognition of necessityని నొక్కిచెప్పాడు.
5. భవిష్య సమాజంలో మానవుడు పరిపూర్ణుడుగా ఎదగడానికి ఒక్క సామ్యవాద సమాజంలోనే సాధ్యమన్న మార్క్స్ వాక్కును విశ్వసించాడు.

ఆనాటి మేధావుల్ని ఆకర్షించినట్టే కాడ్వెల్‌నూ మార్క్సిజం ఆకర్షించింది. ఇంకా బతికివుంటే అందరిలాగే కమ్యూనిస్టు పార్టీని వదిలేసినా ఉత్తమ గ్రంథాలను వెలువరించేవాడని పిస్తుంది. మార్క్స్‌కు చాలా దూరమైపోయింది నేటి మార్క్సిస్టు సాహిత్యం. ఏ ఇజానికీ కవిత్వం లొంగదని రుజువవుతూనే ఉంది. శ్రీశ్రీయే మార్క్స్ మతవిరుద్ధాలైన గీతాలు వ్రాశాడు. కాడ్వెల్ కమ్యూనిస్టుగా బతికి ప్రాణత్యాగం చేశాడు. మార్క్సిస్టుగా సాహిత్య విమర్శకుడుగా, తార్కికతత్వవేత్తగా బ్రతికే ఉంటాడు.

సంప్రదించిన గ్రంథాలు

1. ఇల్యూషన్ అండ్ రియాలిటీ - క్రిస్టొఫర్ కాడ్వెల్
2. స్టడీస్ ఇన్ డైయింగ్ కల్చర్ - క్రిస్టొఫర్ కాడ్వెల్
3. ఫర్దర్ స్టడీస్ ఇన్ డైయింగ్ కల్చర్ - క్రిస్టొఫర్ కాడ్వెల్
4. కవిసేన మేనిఫెస్టో - శేషేంద్ర

# బృందావన వీథికల్లో విహరించే వృద్ధ గోపాలుడు

**- డా॥ వి.వి.యల్. నరసింహారావు**

రాజకీయ నాయకులుగానే కాక రచయితలుగా కూడా ప్రసిద్ధి పొందిన ప్రముఖులు పలువురున్నారు. వారిలో నాటి భారతప్రధాని నెహ్రూ, నేటి భారతప్రధాని పి.వి. నరసింహారావు, అలనాటి హైదరాబాదు రాష్ట్రపు చివరి ముఖ్యమంత్రి బూర్గుల రామక్రిష్ణారావు మొదలైనవారు ముఖ్యులు. ఈ కోవకు చెందిన వారిలో డా. బెజవాడ గోపాలరెడ్డి ప్రత్యేకంగా పేర్కొనదగినవారు.

రెడ్డిగారు సొంత కవితలు వ్రాయడానికి పూనుకున్నది తమకు 70 సం. వచ్చిన తరువాత. అయితే 'అంతవరకు వారికి సాహిత్యరంగంతో సంబంధం లేదా?' అంటే– సంబంధం మాత్రమే కాదు; అనుబంధము, అధికారము కూడా ఉన్నాయి. తెలుగు భాషాసమితి, ఆంధ్రప్రదేశ్ సాహత్య అకాడమీ కేంద్రసాహిత్య అకాడమీ మొదలైన సాహిత్య సంస్థలతో 1948 నుండి పోరాని బంధం పెనగొని ఉంది. ప్రతిష్ఠాత్మక అవార్డు నిర్ణేతృసంఘ సభ్యుడుగా కూడా రెడ్డిగారి అనుభవం విస్తృతమైందే. జ్ఞానపీఠం, రాజాలక్ష్మి, డా. కె.వి.రావు, డా. జ్యోతిరావు మొదలైన అవార్డులు రెడ్డిగారి సేవలను వినియోగించుకొన్నవే. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీలో 1957లో అడుగుపెట్టేవరకు అనేక పదవుల్లో ఆయన రాణించిన సంగతి అందరికీ తెలిసిందే. మంత్రిపదవుల్లో 15 సం:లు, గవర్నరు పదవిలో 5 సం.లు, ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రొఛాన్సెలర్ పదవిలో 6 సం.లు– ఆయన జీవితం ఉన్నత ఉద్యోగపర్వంగా కొనసాగింది. ఉద్యోగపర్వానికి ముందు ఆయనకు 23 సం. వచ్చిన దగ్గర నుంచి దాదాపు 36వ సం. వచ్చేవరకు సుమారు నాలుగు సంవత్సరాలు జైలుశిక్షలు కూడా అనుభవించారు. రెడ్డిగారి రాజకీయ జీవితానికి గట్టిపునాదులేర్పడినదీ కాలంలోనే.

అయితే ఆయన హృదయాన్ని విశ్వవిహాయసంలో విహంగయానం చేయించిన తొలినాళ్లు రవీంద్రుని అంతేవాసిగా విశ్వభారతిలో అధ్యయనం సాగించిన శుభదినాలే. విశ్వభారతిలో చేరేనాటికి ఆయనకు 17 సం.లు మాత్రమే. అక్కడ ముచ్చటగా మూడేళ్లు గడిపి వంగభాషతో పరిచయం ఏర్పరచుకోవడం మాత్రమే కాక రవీంద్రుని అంతరంగపు లోతుల్ని కూడా అవగతం చేసుకునే అవకాశం ఆయనకు కలిగింది. తొలినాటి అనుభవాలు, అభిరుచులు క్రమంగా పరిణతమై ఆయనకు షష్టిపూర్తి జరిగేనాటికి అనేక వంగరచనలు– రవీంద్రునివి తెనిగింపజేశాయి. 'దేవయాని–చిత్రాంగద', 'మానిని', 'ప్రకృతి–ప్రతీకారము', 'విసర్జన', 'ఆరునాటికలు', 'కథలు–కల్పనలు', 'వానచినుకులు', 'ఊర్వశి', 'కాళిదాసు', 'తాజ్‌మహల్', 'నైవేద్యము–స్మరణ' మొదలైన అనువాద రచనలు రెడ్డిగారికి రవీంద్రుని రచనలపట్ల గల పరమప్రత్యయాన్ని స్పష్టంచేస్తాయి. బెంగాల్ నుండి మాత్రమే కాక ఉర్దూ నుండి కూడ రెడ్డిగారు గాలిబ్, ఇక్బాల్ రచనలను రమ్యంగా అనువదించారు.

రెడ్డిగారి స్వతంత్ర రచనలు 'ఆమె' చిద్విలాసంతో రేకులు విచ్చుకున్నాయి. మొగ్గతొడి గింది మాత్రం 'కాలవాహిని'లో ముద్రితమైన 'తాజ్‌మహల్' రచనతోనే (24.5.77) 'కాలపు చెక్కిలిపై మెరసిన కన్నీటిబొట్టు తాజ్‌మహల్' అన్న రవీంద్రుని మాటలు మళ్లీ జ్ఞాపకం వచ్చాయి రెడ్డిగారికి. వాటిని తమ 'తాజ్‌మహల్' రచనలో ఉద్ధరించుకున్నారు. అప్పటికే ఆ 'తాజ్‌మహల్' ఆయన గుండెలో పదిహేనేళ్లుగా మాగిమాగి, మండువేసవిలో 1977లో– పరిమళభరితంగా బైటకు వచ్చింది. అంటే– కవితా సభలోకి స్వతంత్ర కవిగా తన 70వ ఏట అడుగుపెట్టినా అంతరంగంలో అపూర్వ కవితా రచనలు 50 సం.లు పైబడిన దగ్గరనుండీ ఆయనను తొందరిస్తూనే ఉన్నాయి– అని అర్థం.

రెడ్డిగారికి– నేటికి దాదాపు 87 సం.లు. స్వతంత్రరనలు కానీ, అనువాద రచనలు కాని అన్నీ కలిపి ఇప్పటికి 35 రచనలు వెలువరించారు. ముక్తకాలు, దీర్ఘకవితలు, లఘుకవితలు, రేఖాచిత్రాలు మొదలైన పద్ధతుల్లో ఈ రచనలు సాగాయి. 'ఆమె', 'ఆమెజాడలు', నీడలు, తళుకులు, చెణుకులు– ఇవన్నీ అవ్యక్తమధురమైన స్త్రీతత్వాన్ని అపూర్వంగా ఆవిష్కరి స్తాయి. డా. సి.నారాయణరెడ్డిగారి దృష్టిలో ఈ ''ఆమె'' ఉర్దూ కవిత్వంలోని మూర్తీభూత ప్రణయం కావచ్చు. 'దీపికల'లో ఆమెను గూర్చి గోపాలరెడ్డిగారే వివరించారు. ''ఆమె బహురూప; బహుగుణ. ఊర్వశి మొదలు పరాశక్తి వరకు వ్యాపించి ఉన్నది ఆమె''. ఊర్వశి ప్రసక్తివస్తే రెడ్డిగారు పరవశించిపోతారు. 'వేదాలు, పురాణాలు, కాళిదాసు, రవీంద్రుడు, అరవిందుడు, దినకర్, కృష్ణశాస్త్రి, చలం– అందరూ ఆ అనాదికాలపు ఊర్వశిని ఊహానేత్రాల తోనే దర్శించారని పచ్చిపులుసు వెంకటేశ్వర్లుగారి ''ఊర్వశి''కి మణిమేఖల సంతరిస్తూ పలికారు రెడ్డిగారు. వీరి ముక్తకాలలో''స్ఫులింగాలు- తుషారాలు'' వేడివేడిగా చల్లచల్లగా గుండెకు తగుల్తాయి 'కళికలు' కమ్మవాసనలు కుమ్మరించేలా విచ్చుకునే వరకు వేచిచూద్దామ నిపిస్తుంది. వీరి ''స్వప్నహారానికి పీఠికా రూపమైన 'ప్రరోచన' సంతరించే అవకాశం నాకు కలిగింది. స్వప్న లక్షణాన్ని మన ఉపనిషత్కర్తలు (పైంగలిం మొ.) మొదలుకొని ఫ్రాయిడ్, యాగ్, ఎడ్లర్ వంటి మనస్తత్వశాస్త్రవేత్తల వరకు విశ్లేషణ చేసినవారే. కవిగా శ్రీ రెడ్డిగారూ [illegible]షించారు.

''నిద్రా మానస సరస్సులో / సువర్ణకమల మృణాళములు మెసవుతూ /
ఈదులాడే రాజహంస స్వప్నం''
'సువర్ణకమలా' లంటే 'కమ్మని కవితాక్షరాల కమలా'లనే, అర్థాంతరం కూడా సంభావ్యమే.

రెడ్డిగారి కావ్యనామాలు కూడా 'గులాబిరేకు'ల్లా హంసతూలికల్లా ఎంతో సుకుమారంగా సుందరంగా ఉంటాయి. 'సాగర సమీరా'ల్లా, 'మలయమారుతాల్లా' మనస్సును ఆహ్లాదపరు స్తాయి. 'ప్రసూనమంజురు'ల్లా 'పరిమళ తరంగా'ల్లా 'సౌరభనీరాజాన' లిస్తాయి.

రవీంద్రుని నాటకాల్లో 'విసర్జన'ను రెడ్డిగారు తెనిగించి దానికి 'విసర్జన' అనే పేరే ఉంచారు. ఇంగ్లీషులో రవీంద్రుడు దీనికి "Sacrifice" అని పేరుపెట్టారు. కొంగర జగ్గయ్యగారు తెనిగించి 'బలిదానం' అని పేరుపెట్టారు. ఇది రంగస్థలనాటకంగా మంచిపేరు సంపాదించు కుంది. అయితే రెడ్డిగారి 'విసర్జన'ను రెడ్డిగారి ముందే ప్రదర్శించాలని 38 సం. క్రిందట కీ.శే. తెలికచర్ల వెంకటరత్నంగారు మాచేత రంగస్థలం మీద దాన్ని ప్రదర్శింపజేశారు. అందులో నేను 'రాణి' వేషం వేశాను. అంతా బాగానే ఉంది. 'విసర్జన' అనే పేరే చాలా

మందికి కాస్త విరక్తి పుట్టించింది. పదాల ప్రయోగంలో రెడ్డిగారికి మూలవిధేయంగా రచన సాగించడం చాలా ఇష్టం. అక్కడ పట్టువిడుపులుండవు. ఆధునికులకు అటనట అద్భుతగిలే వంగసంస్కృత పదబంధాలు గ్రాంధిక వాసనలలో రెడ్డిగారి కృతుల్లో స్వైరవిహారం చేసాయి.

పుంఖానుపుంఖంగా కవితారచనలు వెలువరించినా రెడ్డిగారు ఛాందసమైన పద్యకవిత జోలికిపోలేదు. ఇది వచనయుగమనీ, స్వేచ్ఛాయుగమనీ, మనదేశంలో దీనికి నాంది వచనంలో వెలుసడ్డ రవీంద్రుని గీతాంజలి అనీ సంభావించారు. మాత్రాచ్ఛంధస్సుల్లో ఉండే సంగీతలయలకు కూడా రెడ్డిగారు తన రచనల్లో ప్రాధాన్యమివ్వక అచ్చమైన వచనకవితలనే భావనిర్భరంగా వెలయించారు.

సంఘానికీ, సాహిత్యానికీ జీవితాన్ని అంకితం చేసిన మహనీయులంటే రెడ్డిగారికి ఎంతో ప్రీతి. వార్ని కవితాంజలితో కృతజ్ఞతాపూర్వకంగా సత్కరిస్తారు. గోదావరీ పాతాళగంగను పైకి పిలిచిన కాటన్, తాళపత్రశాయి అయిన సాహిత్యాన్ని సుప్తశిల నుండి అహల్యను లేపినట్లు లేపిన సి.పి.బ్రౌన్– రెడ్డిగారి కృతజ్ఞతాంజలి నందుకున్నారు.

రాజకీయవేత్తలుగానే కాక గొప్పరచయితలుగా కూడా ప్రసిద్ధులైన గాంధీగారన్నా, నెహ్రూగారన్నా, రాజాజీగారన్నా రెడ్డిగారికి విశేషగౌరవం. రాజకీయాలతో సంబంధంలేని రవీంద్రుడంటే రెడ్డిగారికి మరింత గౌరవం. రవీంద్రుని ఉపదేశాలు చిన్ననాడే రెడ్డిగారి గుండెలు పండించాయి.

''నేను విశ్వభారతి వాడిని / ఏ తెలుగునాటికో / నెల్లూరు సీమకో / అంటిస్తే ఇరికిస్తే ఎట్లా?'' అంటూ ఇరుకుదారుల్ని ఎడాపెడా విస్తృతం చేసుకుంటూ విశ్వ''బృందావన వీథిక''ల్లో విహరిస్తున్న వృద్ధగోపాలుడు శ్రీ గోపాలయ్య.

'జీవిత మాగాణంలో నాటిన ఆనందాశ్రుబీజాలు
చిరునవ్వుల విత్తనాలై మొలిచేది ముదిమిలోనే''

అనే సత్యాన్ని అహరహం నెమరువేసుకుంటూ, కాలాన్ని ఇక్షుఖండంలా నమిలివేస్తున్న వృద్ధకవి వృషభం శ్రీ రెడ్డిగారు. ★

## Marx & Money

It was in 1844 that Karl Marx wrote his celebrated essay on money. Money in capitalism, argued the forgotten prophet, performs miracles; it transforms everything into its opposite; insanity into sanity, dishonesty into honesty, violence into peace. The power of money remains unaltered. Even if one resists this radical temptation of equating capitalism with corruption, the fact is that everything except an instrumental orientation towards life tends to become unimportant in a society obsessed with economic prosperity and development.

# ఆరుద్రగారి సమాధానం

నా సమాచారం కోసం, నా సమాధానం కోసం సంపాదకులు నాకు ముందుగానే అందజేసిన ప్రొఫెసర్ పి.ఎస్. శాస్త్రిగారి వ్యాసం 'ఋగ్వేదంలో స్త్రీలు' చదివాను. వారికి 'ఋగ్వేద సూక్తాలను సాహిత్య దృష్టితో చూసితీరాలనిపిస్తుంది' అన్న అభిప్రాయం కలగవచ్చుగాని వాటిని సామాజిక దృష్టితో కూడా సందర్భాన్ని బట్టి విశ్లేషించాలి. 'మిసిమి' మే సంచికలో ప్రచురితమైన నా వ్యాసాన్ని చదివి నేను కవినని వారు ఊహించలేక పోయినందుకు ఎంతమాత్రం నేను చింతించడం లేదు. ఆ వ్యాసాన్ని కవిగా వ్రాయలేదు. పరిశోధకునిగా, ముఖ్యంగా సామాజిక మానవశాస్త్ర విద్యార్థిగా వ్రాశాను. ఋగ్వేదసూక్తాలను అర్థం చేసుకొనడానికి స్కందస్వామి, రాఘవభట్టు, మాధవ, సాయణప్రభృతుల భాష్యాలపైన మాత్రమే ఆధారపడకూడదు. (పురాణమిత్యేవ నసాధు సర్వం) మతత్రయాచార్యులపైన కూడా ఆధారపడ కూడదు. మధ్వాచార్యులు, ఆనందతీర్థులవారు నలభై సూక్తాలను విష్ణుపరంగా వ్యాఖ్యానించి మిగతా ఋగ్వేదమంతా అలాగే అన్వయించుకోమన్నారు. (బృహద్దేవత ఏమైపోవాలి?).

ఇరవయ్యోశతాబ్దంలో స్వామి దయానందసరస్వతి, కావ్యకంఠ గణపతిశాస్త్రి, అరవిందఘోష్, కపాలిశాస్త్రి, భాష్యాలు, టీకలు మొదలైనవి రచించకపోలేదు. అలాగే మార్క్సిస్టు దృక్పథంతో రాహుల్ సాంకృత్యాయన్, డి.డి. కోశాంబి, దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ, ఇం.ఎం.ఎస్. నంబూద్రిపాద్ మొదలైనవారు కూడా ఋగ్వేదాన్ని విశ్లేషించారు. (నంబూద్రి పాద్ కేరళ బ్రాహ్మణునిగా ఉపనయనం కాగానే ఋగ్వేదాన్ని సస్వరంగా సొంతం చెప్పుకొన్నారు). ప్రాచీన దృక్పథాన్ని అవగాహన చేసుకుంటూనే ఆధునిక దృక్పథంతో ఆదిమ సమాజాలను విశ్లేషించడానికి పూనుకొనడం అవసరం.

'కులస్త్రీలు, కులటలు' అన్న వ్యాసం నేను రచించిన 'గుడిలో సెక్స్' అన్న పుస్తకంలో ఒక ప్రకరణ మాత్రమే. ఆ ఒక్క వ్యాసాన్నే చదివి నాకెన్నో విషయాలు తెలియవని బేరీజు వేయడం ఇటువంటి విమర్శకులకే చెల్లుతుంది. ''ఊర్వశిని గురించి వ్రాసేముందు ఊర్వశీపురూరవ సంవాదాన్ని (10–95) మహాకవి నాటకాన్ని చదివితే బాగుండేది'' అని విమర్శకుల వారు సెలవిచ్చారుగాని ఈ అభిప్రాయాన్ని వారు వెలిబుచ్చేముందు నా గ్రంథంలోని 'అప్సరసలు –ఆర్యఋషులు' అనే ప్రకరణంలో ఊర్వశి గురించి, శకుంతల గురించి నేను వ్రాసిన విషయాలు 'ఋష్యశృంగుని కథలు' అనే ప్రకరణంలో ఊర్వశీ పురూరవుల గురించి చెప్పిన సంగతులు చదివివుంటే మహాబాగుండేది. నేను మహాకవి నాటకాలను ఋగ్వేదం పదో మండలంలోని 95వ సూక్తాన్ని చదివానన్న సంగతిని విమర్శకులు గ్రహించి ఉండేవారు. వారు తాము చూడని విషయాల మీద మాట్లాడడం శోచనీయం. ఆ విధంగానే పదేళ్ళ క్రిందట నేను ఆంధ్రజ్యోతి దినపత్రికలో 'ఆరుద్ర వ్యాసపీఠం' అనే శీర్షికతో వారం వారం వ్రాసిన వ్యాసాల్లో 'పుత్రిక ఎలాంటి కూతురు' అన్న వ్యాసాన్ని చూసివుంటే బాగుండేది. అందులోని సారాంశాన్ని 'కులస్త్రీలు–కులటలు' అన్న వ్యాసంలో పొందుపరచి ఋగ్వేదకాలం నాటి కొన్ని ఆచారాలు ఇప్పటికీ తెలుగుదేశంలో ఉన్నాయని చూపించాను. సోదరులు లేని స్త్రీ గురించి ఒకే ఋక్కును (1–24–7) నేను ఉదహరించి అపార్థాలకు దారితీశానని విమర్శకుల వారి ఉవాచ. పాపం శమించుగాక అని విమర్శకుల వారు అభిప్రాయపడుతున్నారు. నా వ్యాసంలో 'వేదవాఙ్మయంలోనే ఇలాంటి మంత్రాలెన్నో చూడవలసిన అవసరం ఉంది ఒక్కొక్క ఋక్కువల్ల ఒక్కొక్క నూతనాంశం లభిస్తుంది' అని నేను రాసిన మాట విమర్శకుల వారు విస్మరించినట్లున్నారు. వారు సోదరులు లేని చిన్నదాన్ని గురించి ఎన్ని ఋక్కులు ఉదహరించినా, సారాంశంగా అన్నదమ్ములు లేని చిన్నది దుహిత అనిపించుకోదు, పుత్రిక అనిపించుకుంటుంది జారిణిగా ఉండేదని విమర్శకులవారు చెప్పారు. ఈ సంగతి నా వ్యాసంలో విస్తరించి చెప్పాను. బసివి గురించి విశదం చేశాను. వేదం కాలంలోని ఆచారాలు కొన్ని ఈనాటికీ ఉన్నాయని స్పష్టపరచాను. అదే నా ధ్యేయం. నా గ్రంథం 'గుడిలో సెక్స్' పూర్తిగా చదివితే విమర్శకుల వారికి చాలా అపోహలు ఉండేవి కావు. ఇప్పటికైనా మించిపోయింది లేదు. సాకల్యంగా చదివితే మంచిది.

విమర్శకుల వారు తమ వ్యాసం చిట్టచివర 'ఇప్పటికైనా కవులు, సమీక్షకులు అలెగ్జాండర్ పోప్ చెప్పిన **Where Angels fear to tread** అనే సూక్తిని రుజువు చేసుకోరని మా తాపత్రయం' అని ఉద్ఘాటించారు. ఈ సూక్తిని నా విషయంలో కొంతవరకు ఈ విమర్శకుల వారు రుజువు చేసుకున్నారని విచారించక తప్పడం లేదు. ఆ అలెగ్జాండర్ పోప్ మహాశయుడే **'Pride'** ఎవరికీ **Never failing vice** అని చెప్పాడో అది విమర్శకులకు అన్వయించకూడదని కోరుకుంటున్నారు. **Pride, prejudice** లేకుండా సాధికారంగా మాట్లాడగలిగే ఎవరైనా సరే చెప్పిన విషయాలలోని సమంజసమైన వాటిని సవినయంగా స్వీకరించడానికి నేనెప్పుడు సంసిద్ధుడనే.

యీ చర్చ యింతటితో ముగిసింది. - సం.

# 1948 నాటి ''జ్యోతి''

- రావూరి భరద్వాజ

నేను కథలు రాయడం మొదలెట్టింది 1943–1944ల్లో కావచ్చు. నా తొలికథ అచ్చయింది 1946వ సంవత్సరంలో. అచ్చులో నా కథను చూసుకొని, నా పేరును చూసుకొని, అక్షరాలా నేను పొంగిపోయాను. ''పొంగిపోయాను'' అన్నది చాలా చిన్నమాటా, చాలాచాలా బలహీనమయిన మాటానూ.

కథలు రాస్తే డబ్బిస్తారన్న సంగతి, నాకు 1948లో గానీ తెలీదు. అలా తెలియచేసినవారు జ్యోతి మేనేజిమెంటువారు. ఆ పత్రిక తెనాలి నుండి వెలువడుతూ ఉండేది. తొలిసారిగా అయిదు రూపాయల పారితోషికం నాకిప్పించిన ''దేవుడుపుట్టాడు'' అన్న నా కథ, ''జ్యోతి'' పత్రికలో అచ్చయింది. ఇది జరిగిన రెండుమూడు మాసాలకే నేను ''జ్యోతి'' పత్రికలో ఉద్యోగిగా చేరాను. ఇది – నేను కలలో కూడా ఊహించని సంఘటన.

నాకిప్పటికీ బాగా జ్ఞాపకం... ''ఈ ఉత్తరం అందంగానే, తగినన్ని గుడ్డలు తీసుకొని తెనాలి రండి!'' అంటూ వచ్చిన ఓ కార్డు, నా జీవితాన్ని గొప్పగా మలుపుతిప్పుతుందని, నేననుకోలేదు. ఆ ఉత్తరం రాసింది ఆలపాటి రవీంద్రనాథ్ గారు. నేను తెనాలిలో బతకడానికీ, పత్రికారంగంలో, కాలు నిలదొక్కుకోడానికీ, ఆ ఉత్తరమే కారణం!

''జ్యోతి'' పక్షపత్రిక, చాలామంది కొత్త రచయితలను వెదికి పట్టుకొచ్చింది; అప్పటికే ప్రసిద్ధులైన రచయితల సరసన వారిని నిలబెట్టింది! 'శారద', భుజంగరావు, ప్రకాశరావు, శివం, శ్రీనివాసరావు, 'చౌండేశ్వరీదేవి', 'వెంచాశా' రంగాచార్య, వీరందరూ వీరితోబాటు నేనూ కొత్తవాళ్ళమే! మా అందరి పేర్లూ; అటు చలంగారి పక్కనా, ఇటు కొప్పరపు సుబ్బారావుగారి పక్కనా, చూసుకొని, పొంగిపోతూ ఉండేవాళ్ళం.

కొత్తదనంకోసం, తహతహలాడిపోయే రవీంద్రనాథ్ గారు, ఆ తరువాత; ''రేరాణి'' అన్న మాసపత్రికను ప్రారంభించారు. అంతదాకా, విద్యాసంపన్నులకే పరిమితమయిన హావలాక్ ఎల్లిస్, సిగ్మండ్ ఫ్రాయిడ్, రచనలను సరళమయిన తెలుగులోకి మార్చి సామాన్య పాఠకులకందచేసింది ''రేరాణి'', ''జ్యోతి'' పత్రికలే! క్షయ్యవ్యాధిని గురించి, సిఫిలిస్ వ్యాధిని గురించి, జనాభా సమస్యలను గురించి, విడాకులను గురించి – సాహసోపేతమయిన ఎన్నో వ్యాసాలను ఈ పత్రికలు ప్రకటించాయి.

చలనచిత్రపరిశ్రమ మద్రాసులో ఉన్న కారణంగా, సినిమా పత్రికలన్నీ మద్రాసు నుండీ వెలువడుతుండేవి. నాకు గుర్తున్నంతలో, తెనాలి నుండి వెలువడిన తొలి సినిమా మాసపత్రిక ''సినీమా!'' ఈ మూడు పత్రికల బాధ్యతలన్నీ రవీంద్రనాథ్ గారివే!

''రేరాణి'' మాసపత్రికలో అచ్చయిన ''అలవాటైన ప్రాణం'' అన్న నా కథ మీద పోలీసులు కేసు పెట్టారు. అయిదువందల రూపాయల జుల్మానా గానీ, అది చెల్లించని పక్షంలో ఆరుమాసాల జైలుశిక్ష గానీ'' అనుభవించాలని మేజిస్ట్రేటు తీర్పు చెప్పారు. నేను రెండోదానికి

సిద్ధపడ్డాను. రవీంద్రనాథ్‌గారు అయిదువందలూ చెల్లించి నాకీ ఆరుమాసాల జైలు అనుభవం లేకుండా చేశారు. 'అనుభవం' అంటే గుర్తుకొచ్చింది. ''మా అనుభవాలు'' అన్న శీర్షికను ఆనాడే ప్రారంభించి, చాలామంది కొత్త రచయితలను పరోక్షంగా ప్రోత్సహించింది ''జ్యోతి''.

''రచన బాగా ఉండడం ఉండకపోవడం'' అన్నది తప్ప, ఇంకే అంశమూ, సంపాదకుల దృష్టిలో ఉండేదికాదు. ''హంకో మొహబత్''– ''స్టేషన్‌పంపు'' అన్న చలంగారి కథలు ప్రకటించాక, ఆయనగారే ''కళ్యాణి'' అన్న ఇంకో కథను ప్రచురణకోసం పంపించారు. ''మిగతా రెండింటిలాగే ఇదీ ఉంది!'' అన్న అభిప్రాయంతో, ఆ కథను చలంగారికి తిప్పి పంపించింది ''జ్యోతి'' పత్రిక. ఆ తరువాత అదే కథ, అప్పట్లో మద్రాసు నుండి వెలువడుతున్న ''ఆంధ్రజ్యోతి'' మాసపత్రికలో అచ్చయిందనుకోండి.

ఆ రోజుల్లో, విజయవాడలో కొత్తగా రేడియో కేంద్రం వెలిసింది. దాని ప్రసారశక్తి చాలా పరిమితం. అయితేనేంగానీ, దానిచుట్టూ, ''సాహిత్యోపాసకులు, కళాకారులు'' ఎప్పుడూ బిలబిల్లాడుతుండేవారు. అప్పట్లో రేడియో ఉద్యోగులు కూడా, ఆ ప్రయోగానికి - దాదాపుగా కొత్తవారు. ఆ కారణంగా కార్యక్రమాలను రూపొందించడంలోనూ, ప్రసారం చేయడం లోనూ, చాలా పొరపాట్లు జరుగుతూ ఉండేవి. వాటన్నింటినీ ''జ్యోతి'' పత్రిక నిర్భయంగా తూర్పారబడుతుండేది. ఆ విమర్శలకు తట్టుకోలేని రేడియో ఉద్యోగులు కూపీలు తీసి, విమర్శచేస్తున్న కొప్పరపు సుబ్బారావుగారినీ, ఆ విమర్శలను ప్రచురిస్తున్న ఆలపాటి రవీంద్రనాథ్‌గారినీ, ఒక కార్యక్రమంలో ఇరికించి ప్రసారం చేశారు. ఆ కార్యక్రమం అలా కాకుండా, ఎలా ఉండాలో సూచిస్తూ మరుసటి సంచికలో మళ్ళీ విమర్శ వొచ్చింది. అప్పట్లో– సర్దార్ పటేల్, రేడియో శాఖకు కేబినెట్ హోదాగల మంత్రిగా ఉండేవారు. ఆర్.ఆర్. దివాకర్ సహాయమంత్రిగా ఉండేవారు. ఈ విమర్శల ఆంగ్లానువాదాలను చదివి, లోపాలను సవరించి, కార్యక్రమాలు సక్రమంగా ప్రసారం కావడానికవసరమయిన అన్ని చర్యలనూ, వారు తీసుకొన్నారు. ఆ విషయంలో జ్యోతి సంపాదకుల సహాయ సహకారం కూడా పొందాలని - మంత్రి దివాకర్ విజయవాడ వచ్చినప్పుడు రవీంద్రనాథ్, కొప్పరపు వారిని ఆహ్వానించి చర్చలు జరిపారు.

''జ్యోతి'' పాత సంచికలను తిరగవేస్తున్నప్పుడూ, ''రేరాణి''లోని పాతకథలను చదువు కొంటున్నప్పుడూ, నా చిన్నతనంలోకి నేను తొంగిచూసుకొంటున్నట్టుగా ఉంటుంది. నా పునాదుల్లోకి నేను చొచ్చుకుపోతున్నట్టుగా ఉంటుంది.

ఈనాడు, ఆబాలగోపాలం ఆర్భాటం చేస్తున్న అనేక సమస్యలను గురించి - మద్యపానం, జనాభా పెరుగుదల, పాఠశాలల్లో లైంగిక విజ్ఞాన బోధనం– వంటి అనేక అంశాలపై నాలుగున్నర దశాబ్దాల కిందటనే, శాస్త్రీయమైన సాహసోపేతమయిన ఎన్నో వ్యాసాలను నిర్భయంగా ప్రచురించిన ''జ్యోతి'' పత్రికతో, నాకూ అంతో ఇంతో సంబంధమున్నదని చెప్పుకోవడానికి, నేనెప్పుడూ గర్వపడుతుంటాను.

# నేటి 'మిసిమి' మిలమిలలు

**– సహవాసి**

ఈనాటి కొన్ని పత్రికల్ని, రకరకాల మసాలాలు దట్టించిన సాహిత్యాన్ని, సినిమాలను చూస్తున్నప్పుడు, 'చక్కిలిగింతలు లేవా చక్కని ఊహలు రావా' అన్న ఏనాటిపాటో మనస్సులో మెదుల్తుంది. 'మిసిమి' వాటికి మినహాయింపు. ఎందుకంటే, సంపాదకులు శ్రీ ఆలపాటి రవీంద్రనాథ్ చక్కని ఊహలు గల వ్యక్తి. కాబట్టే ఆయన సంపాదకత్వాన వెలువడుతున్న 'మిసిమి' పాఠకుల మనస్సులకు చక్కిలిగింత.

అట్టమీద బొమ్మ మొదలు ఆఖరుపేజీదాకా ఆసాంతం 'మిసిమి' తనదైన ప్రత్యేకతతో మినమినలాడుతోంది. మొక్కపాటి కృష్ణమూర్తి, రవివర్మ, దామెర్ల రామారావు ప్రభృతుల చిత్రాలు కళాదృష్టికల పాఠకులందరికీ కనువిందే. 1993 జూన్ సంచిక ముఖచిత్రం 'Christ & Repentant Sinners' (క్రీస్తు–పశ్చాత్తప్తులైన పాపులు), 1993 ఆగస్టు సంచిక అట్టమీది 'An Experiment on a Bird in the Air pump' చిత్రం, 1993 డిశంబరు సంచికపైన క్లాడ్ స్ట్రాయింగు, ఎన్.ఎన్. చామకూర 'Sad Memories' ల్లోని రసానుభూతి హృదయాల్ని తరంగితం చేస్తుంది. 1616–18 నాటి 'క్రీస్తు–పశ్చాత్తప్తపాపులు' చిత్రాన్ని ఇప్పుడు చెప్పు కొన్న ఇతర చిత్రాల్ని సేకరించి నాబోటి పాఠకులెందరికో తాను పొందిన రసానందాన్ని పంచి ఇచ్చిన శ్రీ రవీంద్రనాథ్ ఉత్తమ కళాభిరుచి ఉదాత్తగుణం ఎందరికుంటాయి?

నేటివరకు ప్రచురణకు నోచుకోని మేటి రచనల్ని సమీక్షించిన ఘనతా, ఆంధ్రదేశం మరచిపోయిన తన ఆనర్ఘరత్నాల్ని పునర్దర్శింపజేసిన వాసీ 'మిసిమి'వే. డాక్టర్ అంబేద్కర్ తన 'Buddha and His Dhamma' (బుద్ధుడు, ఆయన ధమ్మం) పుస్తకానికి రాసిన పీఠిక ఇప్పటిదాకా వెలుగుచూడలేదని బహుకొద్దిమందికి తప్ప ఎవ్వరికీ తెలీదు. 1956 మార్చి 15న ఆయన ఆ పీఠిక రాశారు. ఆ గ్రంథ రచన నేపథ్యాన్ని అర్థంచేసుకోవడానికి తోడ్పడే అటువంటి పీఠిక వస్తువు గురించి, దానిని పుస్తకంతో పాటు కలిపి ఈనాటివరకు ప్రచురించని కారణాలకు సంబంధించి టి. రవిచంద్ 'మిసిమి'లో చర్చించేదాకా నాబోటి పాఠకులనేక మందికి అంతటి ముఖ్యవిషయం ఎరుకలేదు. ఆంధ్ర తొలి మార్క్సిస్టు పరిశోధకుడు డాక్టర్ కె.బి.కృష్ణ (1898–1948) గురించి చాలమందికి తెలియదు. రాజకీయ శాస్త్రంలో అమెరికాలోని హార్వర్డ్ విశ్వవిద్యాలయం నుంచి డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ డిగ్రీ పొందిన కె.బి.కృష్ణ జీవితానికి సంబంధించిన అనేక వాస్తవాలను ఈతరం వారికి తెలియజెప్పింది టి. రవిచంద్ వ్యాసం. 1942కి పూర్వమే భారతీయ తత్వశాస్త్రం, భౌతికవాదాలపై సాధికారి కంగా అపూర్వ గ్రంథ రచన చేసిన అసాధారణ మేధావి డాక్టర్ కె.బి. కృష్ణ అని తెలుసుకొన్న ప్పుడు గర్వంతో పులకరించిపోని తెలుగు వాడుండడు.

డా॥ కె. సచ్చిదానందమూర్తి, ఆచార్య దయాకృష్ణ ప్రభృతులు తత్వశాస్త్రంపై రాసిన వ్యాసాలు, ఆచార్య నాగార్జునుడిపై డా॥ జి.వి. కృష్ణారావు వ్యాసం, కవికోకిల దువ్వూరి రామిరెడ్డి 'అభినవాంధ్ర సాహిత్యం' లాంటివి 'మిసిమి' విరజిమ్మిన ఆణిముత్యాలు. వాటిలో

కొన్ని పునర్ముద్రణలే కావచ్చు, ఈతరం వారి కవి వరప్రసాదం లాంటివి. ఆల్బర్ట్ మొరావియా, బోరిస్ పాస్టర్‌దనాక్, ఇర్వింగ్ వాలెస్ ప్రభృతి విశ్వవిఖ్యాత నవలాకారుల జీవితాలు, సాహిత్యాల పరిచయం సామాన్య పాఠకుల్ని విశేషంగా ఆకర్షించింది. ప్రసిద్ధ మరాఠీ రచయిత శివాజీ సావంత్ రాసిన 'మృత్యుంజయ' పౌరాణిక నవలపై ఆలపాటి రవీంద్రనాథ్ సమీక్ష 1992 సెప్టెంబరు 'మిసిమి' సంచిక హైలైటు. తన నిమ్నతర సాంఘిక హోదాతో, తన శౌర్యానికి గుర్తింపు లేమితో రాజీపడలేక మథనపడిపోయిన దానవీరశూర కర్ణుని స్వాభిమాన పూరిత స్వగతం హృదయాన్ని కదిలిస్తుంది.

తత్వశాస్త్రం, సాహిత్యం, కళలపై తేలిక భాషలో మామూలు పాఠకులకు సైతం తేటతెల్లమయ్యేటట్లు మేధావులు రచనలు చేయగలిగితే 'మిసిమి' మరెందరో పాఠకులకు చేరువవుతుంది; జిజ్ఞాస, రసపిపాసకల మామూలు చదువరులెందరో ఆలోచనాలోచనాలను ప్రభావితం చేయగలుగుతుంది. మిసిమి అంటే కొత్త కాంతి కదా! అది నిత్యనూతనంగా భాసిల్లుతూ ఇంకా విస్తరిల్లాలి.

---

## The well-known dialogue

The interdependence and interconnection of all art forms was universally recognised in ancient India. The well-known dialogue between a king andərishi, quoted in the *Vishnudharmottaram*, is quite revealing.

*King:* O sinless one! Be good enough to teach me the methods of image-making.

Sage: One who does not know the laws of painting can never understand the laws of image making.

*King:* Be then good enough, O Sage, to teach me the laws of painting.

*Sage:* But it is difficult to understand the laws of painting without any knowledge of the technique of dancing.

*King:* Kindly instruct me then in the art of dancing.

*Sage:* This is difficult to understand without a thorough knowledge of the laws of instrumental music.

*King:* Pray teach me the laws of the instrumental music.

*Sage:* But the laws of instrumental music cannot be learnt without a deep knowledge of the art of vocal music.

*King:* If vocal music be the source of all the arts, reveal then to me, O Sage, the laws of vocal music.

While this dialogue underscores the fundamental unity of all art at the formal or structural level it is the *rasa* doctrine that provides the internal and emotive thread of continuity in the Indian tradition.

# ‘మిసిమి’ పై పాఠకులు అభిప్రాయములు

అందమైన ఆహార్యం, అంతకన్నా భావస్ఫోరకమైన ఆలోచన కలగలిపిన మనిషి ఎంత ఆకర్షణీయంగా వుంటాడో, పత్రికల్లో ‘మిసిమి’ అలాంటి పసిడి తునుక. సామాజిక వ్యాసంగాలన్నిటిలో అన్ని రంగాలలోనూ సృజనాత్మకత, లోతైన గవేషణ, విశిష్టమైన విశ్లేషణ కలిసి త్రిగుణాత్మకమైన రచనలద్వారా జిజ్ఞాసాపరులను అయిదేళ్ళుగా అలరింపజేస్తున్నది. సామాన్యుల్లో పరిశోధనా శక్తిని, ఆసక్తిని పెంపొందింపచేయడంలో ఆలోచనాపరుల పాత్ర ప్రపంచం ఎరిగిందే. అలాంటివారి వివేచనకు పదును పెట్టే అసమాన మాసపత్రిక ‘మిసిమి’. తెలుగు పత్రికా ప్రపంచంలో అనన్య సామాన్యమైన యీ ప్రయోగాన్ని శ్రద్ధా, దక్షతలతో పాఠకజన మనోభిరామంగా ఆలోచనామృత సంధాయిగా నిర్వహిస్తున్న శ్రీ ఆలపాటి రవీంద్రనాథ్ గారు తెలుగు చదువరుల కృతజ్ఞతాభివందనములకు సదా సర్వదా బహుధా పాత్రులు. ‘మిసిమి’ మరింత వన్నె, వాసి సంపాదించుకొనేందుకు యీ అయిదేళ్ల అనుభవం దోహదకరం కావాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.

సి. రాఘవాచారి, ఎడిటర్, ‘విశాలాంధ్ర’.

**‘MISIMI’ MARCHING AHEAD**

It does one's heart good to see a serious periodical like **‘MISIMI’**, not only surviving, but marching from strength to strength, month by month. It is not a matter of circulation but of cerebration. Even if there are a thousand readers influenced by its content, it will be a substantial gain to the intellectual life of the Telugu - speaking public.

I was particularly impressed by the article (reproduction of a lecture, rather) on the origin of the caste system in India by the late Dr. BSL Hanumanth Rao. Caste-system is one of the most intriguing but durable features of Indian polity. Almost everybody denounces it on the public platform, but few or none seem to have the guts to break away from its bonds in private life. As for its origin, there are as many theories as there are scholars or pseudo-scholars. Dr. Hanumantha Rao had done some original research and broken new ground in this confusing jungle of myths and legends, miscalled theories. It was a pleasant surprise to read of the presence of the priestly class in the Harappan civilisation, which had come into the Aryan society; also that the 'Sudras' were not 'Dasyus' or 'Dravidians'. (a valuable addition to Dr. B.R. Ambedkar's booklet, **"Who are the Sudras"?)**.

Mr. Sardesai Tirumala Rao's brief but pointed note on 'Sex and Sringara' was refreshingly frank. We have a long hallowed tradition of hypocrisy. That is why it is just as well that the **Rigveda** and Sri **Venkateswara Suprabhatam** are left to remain in Sanskrit. I am sorry that Tirumala Rao, whom I knew well, with his quest for knowledge, is no more.

There are many talented scholars, like B. Srinivasacharya, who is a good critic, in addition to being a seasoned translator.

Even the quotations used to fill blank spaces have a quality of their own. The paragraph on Indian tradition from M.N. Roy, in which he says: "India experienced neither a Renaissance nor a Reformation. The intellectual stagnation lasted until the middle of the 19th century, when a faint echo of the modern rationalist and liberal thought reached India to disturb India partially. During the latter half of the century, the intellectual life of the country was influenced by a number of men who preached revolt against religious orthodoxy, intellectual parochialism and social injustice. There was no great philosopher amongst them".

These observations should make us think and re-assess our own heritage with objectivity

- Dr. D. Anjaneyulu, Madras

సంపాదకులకు,

''వేయి పూలు వికసించనీ'' అన్న లక్ష్యంతో మెదడుకు పదును పెట్టే వ్యాసాలను కొన్ని, సమాచారం అందించేవి కొన్ని ప్రచురిస్తున్నారు. రాగద్వేషాలకు అతీతంగా సత్యాన్వేషణ చేయటం చాల కష్టమైన పనే. తన మాటల వలన చేతల వలన ఇతరులను ప్రభావితం చేసేవాడే మేధావి. అటువంటి రచయితలు మనకు లేరనే నేననుకుంటున్నాను. అలాంటివి ఏ దేశంలోనున్నా, భాషలోనున్నా వెతికి ప్రచురిస్తే మంచిదని నా అభిప్రాయం. అది కష్టమైనదని నాకు తెలుసు. వాటితోబాటు, ''నన్ను ప్రభావితం చేసిన వ్యక్తి, పుస్తకం'' అన్న శీర్షిక కొంతమంది చేత వ్రాయించి ప్రచురిస్తే బాగుటుందేమో ఆలోచించండి. 'మిసిమి'లో వ్యాసం గాని, కవిత గాని, కథ గాని ప్రచురించబడటం ఓ గొప్ప అనే భావం కలిగేలా చేయండి.

- 'మిసిమి' అభిమాని ఎల్.వి.ఎస్. ధన్.

## జిజ్ఞాసువుల పత్రిక

'మిసిమి' జిజ్ఞాసువుల పత్రిక. పరిశోధకుల వేదిక. మానవీయత కాని భూమిక. 'మిసిమి' తొలి సంచికనుండి చదివాక దాన్ని గురించి నాకు కలిగిన అభిప్రాయ మిది. చదివేవారి ఆసక్తిని రేకెత్తించేవి అందులోని వ్యాసాలు. చదువరి ఆలోచనలకు పదును పెడుతుంది ప్రతి సంచిక. మేధావులు కూడా చాలామంది కొన్ని ఆలోచనా రీతులకు కట్టుబడి వుంటున్నారు. కొత్తభావాల యెడ విముఖంగా ఉంటున్నారు.

అయితే మానవ శాస్త్రాలు, భౌతిక శాస్త్రాలు ఏనాటి కానాడు, సరికొత్త సమాచారాలను అందిస్తున్నాయి. ఇది పరిశోధనా యుగం. మూల విశ్వాసాలనే పునాదుల నుండీ పరిశీలించి, వాటి ఆమోద యోగ్యతను పరీక్షిస్తున్నాయి ఈనాటి పరిశోధనలు. సరికొత్త వెలుగులలో, గూడుకట్టుకొన్న నమ్మకాలు సంశయాత్మకంగా అగుపిస్తున్నాయి. మానవుని భావనా స్వేచ్ఛను పెంచుతున్నయి పరిశోధనలు. 'మిసిమి'లోని దాదాపు అన్ని వ్యాసాలూ పరిశీలన, పరిశోధనా పత్రాలే. భావ ప్రదీపకాలే. అందుకనే అది జిజ్ఞాసువుల పత్రిక అయింది. పరిశోధకుల వేదికగా రూపొందింది. పాఠకుల్లో స్వతంత్రంగా ఆలోచింపజేసే సాధనం అయింది. మానవ వ్యక్తిత్వానికి పునాది స్వతంత్ర ఆలోచనా పటిమే కదా!

అందమైన ఆకృతి, స్ఫూర్తిదాయకమైన వ్యాసావళి, 'మిసిమి' పేరును సార్థకం చేస్తున్నాయి.

- జస్టిస్ ఆవుల సాంబశివరావు.

'మిసిమి' సంపాదకులు ఆలపాటి రవీంద్రనాథ్ గారికి,

నమస్కారం. 'మిసిమి' అయిదు సంవత్సరాలు పూర్తి చేసుకొని ఆరవ సంవత్సరంలో ప్రవేశిస్తున్నందుకు 'మిసిమి'కీ, దాని సంపాదకులకూ, దాని రచయితలకూ, పాఠకులకూ, దానికి సంబంధించిన ఇంకా ఇతరులకూ హార్దికాభినందనలు తెలుపుకోటం ఎంతో ప్రమోదకరంగా వున్నది.

తెలుగులో ఇటువంటి విశిష్ట మాసపత్రిక అస్తిత్వం తెలుగులోని ప్రౌఢ సాహితీరంగానికి ఎంతో గర్వకారణం. కల్పనా సాహిత్యం, కవితా సాహిత్యం వాటి రంగాల్లో అవి చాలా విలువైనవే, సందేహం లేదు. అదంతా హృదయ సాహిత్యం. కాని మనిషి హృదయ సత్తాతో మాత్రమే జీవించలేడు. హృదయానికి తోడు మేధ కూడ ఎంతో అవసరం.

అటువంటి మేధను ప్రతిబింబించే తెలుగు పత్రికలు ఇటీవలి కాలంలో లేవనే చెప్పాలి. ఈ లోపాన్ని గుర్తించిన రవీంద్రనాథ్‌గారు ఈ లోపాన్ని తీర్చ సంకల్పించి ఈ 'మిసిమి'ని స్థాపించి ఈ లోపాన్ని తీర్చారు. ఇందులో ఆలోకనకు, ఆలోచనకు, సమాలోచనకు, శాస్త్రీయ దృక్పథానికి, తాత్విక, తార్కిక చర్చలకు, భౌతిక విజ్ఞాన, మనోవిజ్ఞాన సత్యాన్వేషణలకు వైశిష్ట్యాన్ని, వైలక్షణ్యాన్ని, వైవిధ్యాన్ని పాఠకులకు అందిస్తూ వారి జిజ్ఞాసా జ్వాలను ప్రజ్వరింప జేయటంలో సఫలులు అయినారు.

ఇటువంటి ప్రగాఢ పత్రికను నడపటంలో ప్రధానమైన చిక్కు ఏమంటే కల్పనా సాహిత్యాన్ని సృష్టించే రచయితల వలె ఇటువంటి మేధాసాహిత్యానికి రూపం ఇచ్చే రచయితలు ఎక్కువగా వుండకపోవటం.

అయినా, ఇటువంటి ప్రగాఢ రచయతలు కొందరైనా లేకుండా లేరు తెలుగు సాహితీరంగంలో. రవీంద్రనాథ్ గారు

అటువంటి విశిష్ట సమర్థు లందరనూ గాలించి పట్టుకొని 'మిసిమి'ని పూర్తిగా మెరిసే విధంగా, మసక రానీయకుండా ప్రోజ్వలంగా తీసుక వస్తూనే వున్నారు.

ఒక పత్రిక స్ఫూర్తితో జీవించాలంటే, ఆర్తిని ప్రత్యక్షం కాకుండా చూడాలంటే దాని సంపాదకులకంటే కూడ, రచయితల కంటేకూడ ప్రముఖ అవసరం దాని పాఠకులు.

మంచిదానికి దాని భవిష్యత్తు ఎల్లప్పుడూ మంచిగానే వుంటుంది.

– సంజీవదేవ్

అతులిత సేవ జేసి
తురకాంధ్రుల పోషణ పొందలేక
శాశ్వతముగ కండ్లు మూసినవి
వంతల నోర్వగలేక
''భారతి'' ''ప్రతిభ''లు.
కాని,
యీ 'మిసిమి' పాప
మఱింకొకసారి
ఆంధ్రసాహితి వికసింప జేయునట!
ఈ పసికూనను,
వాణీ!
ఏలుకో! – గజ్జల జగత్పతి IAS (Retd), Bhopal.

"A Brief History of Time" వ్రాసిన 20వ శతాబ్ది మేధావిగా గుర్తించబడ్డ శ్రీ స్టీఫెన్ డబ్ల్యు. హాకింగును మొదట తెలుగు పాఠకులకు పరిచయం చేసిన ఖ్యాతి 'మిసిమి'కే దక్కుతుంది.

– రంగాచారి, తిరుపతి.

## వాసి కల 'మిసిమి'

ఊహాజనిత ఇంటర్వ్యూల శీర్షికతో పదిమంది తెలుగు మేధావులను దులిపి, వాళ్ళ గోత్రాలు చెప్పించి, గోడ కుర్చీ వేయించిన మధురవాణితో రాజకీయ వేత్తలను గూడా ఇంటర్వ్యూ చేయించి పుణ్యం కట్టుకోమని వారిని కోరతాను.
– భవానీశంకర్, విశాఖపట్నం.

## నిజాయితీగల ఆచరణా – మేధస్సా?

'మిసిమి' ద్వారా ప్రపంచ ''మేధావుల మెతకలు'' అనే శీర్షికలో కారల్‌మార్క్స్ నుండి టాల్‌స్టాయి మొదలైన 6 గురు వ్యక్తుల గురించి, వాళ్ళ పుస్తకాల్లోని వాళ్ళ మేధాశక్తికి సంబంధించిన వ్రయివేటు జీవితంలో ఎన్నెన్ని అకృత్యాలు చేశారో తెలుసుకునేందుకు అవకాశం కలుగజేసినందుకు తెలుగు పాఠకులు 'మిసిమి'కి రుణపడి వున్నారు. కొన్ని విషయాలలో వాళ్ళు చేసిన పనులు చదివితే మామూలు మనుష్యులు ఎంత మంచివారనే అభిప్రాయం కలుగుతుంది. దూరపుకొండలు నునుపు అనే విషయం ఋజువయింది.

– సుమలత, అనంతపురం.

## అసాధారణ మాసపత్రిక

బాల్యం నుంచి భారతి లాంటి పత్రికలు చదివి, సాహిత్య కాంక్షతో అధ్యయనం చేసి, సాహిత్య సౌరభాలను ఆఘ్రాణించటానికి తాపత్రయపడేవాళ్ళలో నేనొకడిని - ఉత్సాహం పోలేదు. కాని సాహిత్య శైలి పూర్వ ఔన్నత్యాన్ని కోల్పోయినట్టుంది. కారణాలు ఏమయినా నేడు మనకు ఆదర్శపూరితమైన విజ్ఞాన దర్పణం లభించటంలేదు. 'మిసిమి' సమకాలీన తెలుగు సంస్కృతి సహారాలో ఓ చిన్న ఒయాసిస్. సాహిత్యం వుంది, తర్కం వుంది. వేదాంతసారం, సాంఘిక విశ్లేషణలు వున్నాయి. యిది అసాధారణ మాసపత్రి, ఒక మధురమైన మహానుభూతి.
డా. నూరత్తు వేణుగోపాలరావు, ఐ.పి.ఎస్. (రిటైర్డ్.)

Professor **K. Satchidananda Murthy**
Padma Bhushan, Vachaspati, Kalaprapurna, Vidyasagara,
Ph.D., Hon. D Litt., Dr Phil h.c., Hon D Sc.

# MESSAGE

Shri A. Ravindranath is known to be both well-read and widely read. He is an intellectual as well as a person who has had a successful career in the business of publishing and printing He has ideas, enthusiasm, expertise and means. So, five years ago he launched a new sort of journal in Telugu, **MISIMI**, and has been running it with zeal.

**MISIMI** is beautifully produced and a number of its articles are of the type which are perhaps not to be found in any other Telugu periodical. Literature, philosophy, psychology, religion, art and biography: these are the subjects on which most articles have appeared in it. To some extent, the better ones among them seem to be those which treat their themes/topics in new ways, show famous personalities as subject to raga-dvesha, or scoff at orthodox beliefs and customs which have no rational basis.

**MISIMI** is, therefore, a quite unique one among Telugu periodicals at present. Sri Ravindranath publishes its journal mainly for his pleasure and self-fulfilment, while it brings happiness and new insights to discerning readers. On its completing half a decade of its existence, I wish **MISIMI** a bright future.

**K. Satchidananda Murty,**
Sangam Jagarlamudi, Guntur Dist.

**Dr. K. JAGGAIAH,** B.A., D.Litt.,
MOVIE ARTISTE & FORMER MEMBER OF PARLIAMENT

"మిసిమి" పత్రికను ఆదినుంచీ క్రమం తప్పకుండా చదివే పాఠకులలో నేనొకణ్ణి. ఆ అర్హతతో మీకు రెండు ముక్కలు వ్రాయాలనిపించింది.

యిది ELITE పత్రిక. ఇలాంటి పత్రికలు పూర్వం ఉండేవి కాని ఇప్పుడు అరుదు. ఆ కొరతను మీరు తీరుస్తున్నందుకు నా అభినందనలు. పాక్షికదృష్టి లేకపోవడం మీ Policy లో సుగుణం.

విషయ సంకలనంలో కావలసినంత వైవిధ్యం ఉంది. వ్యాసాలు చాలావరకు మంచి స్థాయిలో ఉండడమేకాక, ఆసక్తికరంగా కూడా ఉంటున్నై. 'దర్శనాలు', 'చిత్రకళ' గురించిన వ్యాసాలు ఈ సందర్భంగా పేర్కొనదగినవి. అక్కడక్కడా కొన్ని రచనల్లో మాత్రం CLARITY ఉండడం లేదు. వ్రాసేవాళ్లు పండితులు కావచ్చు. కాని వాళ్లు వ్రాసేది మాత్రం పండితులు కానివాళ్ల కోసం (అలాగని పామరులు కాదు) అని గుర్తించుకోవడం అవసరం.

DEVIL'S DICTIONARY ప్రచురణ ఒక ప్రత్యేకాకర్షణ. ఎక్కడా దొరకనిది ప్రచురించి గొప్ప సేవ చేశారు.

ప్రసిద్ధమైన, ప్రసిద్ధులైనవారి PAINTINGS ముఖచిత్రాలుగా ఎన్నుకుంటున్న మీ అభిరుచికి Hats Off.

కాని నాకు నచ్చని ఒకే ఒక విషయం: మీరు కూడా ఇటీవల COMMERCIAL ADVERTISEMENTS వేయడం. నా దృష్టిలో అది 'విరోధాభాస'. ఆ పేజీలను కూడా మంచి చిత్రాలకు వాడుకుంటే, క్వాలిటీ నిలబడుతుంది.

ఏమైనా మీరు మంచి పని చేస్తున్నారు. ఈ పత్రికను మీరు మీ తృప్తికోసం నడుపుతూ ఉండవచ్చు; కాని దానివల్ల చదివేవారికి అంతకంటే ఎక్కువ ప్రయోజనం కలుగుతున్నదనడం మరింత వాస్తవం.

**CHEERS AND MAY YOUR TRIBE INCREASE!**

**K. Jaggaiah.**

# మిసిమి – మాసపత్రిక

## 1–5 సంపుటాలు. 60 సంచికలు

## (25–2–1990 నుంచి జులై 1994 వరకు)

### – అనుక్రమణిక –



**నమూనా ఆరోపం (SAMPLE ENTRY)**

① ② ③ ④ ⑤ ⑥
జి.వి. కృష్ణరావు. కళాపూర్ణోదయము - సంవిదాన కథా వైచిత్రి. 4-7. 2-1993.

⑦ ⑧
19-23.

1. రచయిత
2. వ్యాసనామం
3. సంపుటి
4. సంచిక
5. ప్రచురణ మాసం
6. ప్రచురణ సంవత్సరం
7. పుట ప్రారంభం
8. ముగింపు పుట.

# ఆరోపాల సారాంశం

| వ. సం. | దశాంశ వర్గీకృత సంకేతం | విషయం | మొత్తం ఆరోపాలు | ఆరోప సంఖ్య |
|---|---|---|---|---|
| 1 | 100 | తాత్విక రంగం | 24 | 1-24 |
| 2 | 150 | మానసిక రంగం | 20 | 25-44 |
| 3 | 200 | మతరంగం | 9 | 45-53 |
| 4 | 300 | సామాజిక, రాజకీయ, విద్యారంగం | 29 | 54-82 |
| 5 | 400 | భాషా రంగం | 9 | 83-91 |
| 6 | 500 | భౌతిక, జీవ, ఆరోగ్య రంగాలు | 17 | 92-108 |
| | 600 | | | |
| 7 | 700 | కళా రంగం | 9 | 109-117 |
| 8 | 800 | సాహిత్య రంగం | 56 | 118-173 |
| 9 | 900 | చరిత్ర, నాగరికతా రంగం | 1 | 173 ఎ |
| 10 | 920 | జీవిత చరిత్రలు | – | – |
| 11 | 921 | – తత్వ వేత్తలు | 16 | 174-189 |
| 12 | 923 | – సాంఘిక, రాజకీయవేత్తలు | 10 | 190-199 |
| 13 | 927 | – కళాకారులు | 6 | 220-205 |
| 14 | 928 | – సాహిత్య వేత్తలు | 17 | 206-222 |

బాలబంధు, లైబ్రరీ సైన్సులో నిష్ణాతుడు అయిన
డా. వెలగా వెంకటప్పయ్య గారు 'మిసిమి'పై అభిమా
నంతో 60 సంచికలు స్వీకరించి ఇండెక్సుగా తయారు
చేసినందుకు మేము ఎంతో ఋణపడి ఉన్నాము.

– సం.పా. 'మిసిమి'

## 100 తాత్విక రంగం

అన్నపురెడ్డి వెంకటేశ్వర రెడ్డి. శ్రీ వెంకటాద్రి వ్యాసం చదివాక. 1-17. 12-1990. 27-32
గమనిక:- 9-1990 సంచికలో ''మానవతావాదం - శాస్త్రీయ దృక్పథం'' - పై స్పందన 1

ఎన్. అంజయ్య. ఆచార్య పి.ఎన్. శాస్త్రి ఏమి చెప్పదలచారు? 5-11. 6-1994. 218-223.
గమనిక:- 7-1994 సంచికలో ''మిథ్యాత్రయమనే నాల్గవ మిథ్య'' - పై స్పందన 2

ఎన్. ఇన్నయ్య. గణితాన్ని తత్త్వశాస్త్రంతో మేళవించిన స్పినోజా, లెబ్నిజ్. 3-34. 5-1992. 31-35. 3

— నేను వున్నాను అంటే ఆలోచిస్తున్నాను గనుకనే! డెకార్టు పద్ధతులు. 2-33. 4-1992. 13-18. 4

— మాట్లాడలేనిచోట మౌనం పాటించు - విట్‌గెన్‌స్టైన్ విశిష్టతత్త్వం. 4-5. 12-1992. 19-23. 5

ఏటుకూరి బలరామమూర్తి. శూన్యవాదం. 2-29. 12-1991. 3-12. 6

కొత్త సచ్చిదానంద మూర్తి. జైన (అర్హత) దర్శనం. 5-12. 7-1994. 239-244. 7

— తత్త్వాన్ని విశ్వజనీనం చేయగలమా! 4-11. 6-1993. 3-14. 8

జిడ్డు కృష్ణమూర్తి. ముందున్న జీవితం. అను. సరోజినీ ప్రేమ్‌చంద్. 5-11. 6-1994. 224-226. 9

జి.వి. కృష్ణరావు. యుగయుగాలుగా భావప్రపంచాన్ని ఉర్రూతలూపుతున్న ఆచార్య నాగార్జునుడు. 1-16. 11-1990. 3-16; 1-17. 112-1990. 11.21. 10

టి. రవిచంద్. బొమ్మకంటి వ్యాసం పై ఒక అభిప్రాయం. 5-12. 7-1994. 276.
గమనిక:- జూన్ 1994 సంచికలో ''చార్వాక (లోకాయత) దర్శనం'' పై స్పందన. 11

దయాకృష్ణ. భారతీయ తత్త్వశాస్త్రం - కల్పనామయమా! 5-8. 3-1994. 83.85. 12

పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి. మిథ్యాత్రయమనే నాల్గవ మిథ్య. 5-12. 7-1994. 254-260.
గమనిక:- దీనిపై 6-1994 సంచికలో ఎన్. అంజయ్యగారి స్పందన కలదు 13

బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు. చార్వాక (లోకాయత) దర్శనం. 5-11. 6-1994. 199-207.
గమనిక: దీనిపై 7-1994 సంచికలో టి. రవిచంద్‌గారి స్పందన కలదు. 14

ముదిగొండ వీరభద్రశాస్త్రి. మానవుడిలోని అతీతాంశ. 1-10. 10-7-1990. 3-8. 15

రాంభట్ల కృష్ణమూర్తి. అసతో సద్గమయ. 3-35. 6-1992. 25-28. 16

రావిపూడి వెంకటాద్రి. అద్వైతం - శంకరుడిదా, గౌడపాదుడిదా? 2-24. 7-1991. 26-29; 2-25. 8-1991. 26-31 17

— ఏదో వుంది? ఏదో వుంది? 2-18. 1-1991. 9-14. 18

— మానవతావాదం - శాస్త్రీయ దృక్పథం. 1-14. 10-9-1990. 8-19. 19

— హేతువాదం - మానవతావాదం. 2-20. 3-1991. 18-23; 2-21. 4-1991. 27-32. 20

శివలింగం. భారతీయ ఆలోచనాధార - మేధాదారిద్ర్యం. 4-9. 4-1993. 18-25. 21

సంజీవదేవ్. ధోరణి.
I. 4-2. 9-1992. 13-18.
II. 4-3. 10-1992. 12-18.
III. 4-4. 11-1992. 33-38.
IV. 4-5. 12-1992. 24-30.
V. 4-9. 4-1993. 11-17.
VI. 4-11. 6-1993. 34-40.
VII. 5-1. 8-1993. 9-14.
VIII. 5-3. 10-1993. 9-14. 22

— మాట-మౌనం. 3-35. 6-1992. 10-14. 23

సురమౌళి. హిందూతత్వంలో సాగుతున్న అంతర్ ఘర్షణ! 4-10. 5-1993. 3-7. 24

## 150 మానసిక రంగం

అట్లూరి వెంకటేశ్వరరావు. కోపం కొంప ముంచుతుంది. 5-9. 4-1994. 145-147. 25

— తనువు మెండికేస్తే తల గదమాయిస్తుంది. 4-2. 9-1992. 19-25. 26

— మనస్సు పనిచేసే తీరు. 2-32. 3-1994. 18-22. 27

— మనస్సు మలచుకోడానికి మెలకువలు. 2-33. 4-1992. 23-26. 28

అన్నపురెడ్డి వెంకటేశ్వరరెడ్డి. ప్రేమ పురాణం. 2-27. 10-1991. 25-28. 29

— ప్రేమించడం ఒక కళ.
I. 4-7. 2-1993. 33-36.
II. 4-9. 4-1993. 26-32.
III. 4-10. 5-1993. 24-32.
IV. 4-11. 6-1993. 7-14. 30

— సింగ్మండ్ ఫ్రాయిడ్ కి గ్రహణమా? 1-11. 25-7-1990. 3-7. 31

— స్వప్న సిద్ధాంతాలు
I. 5-7. 2-1994. 76-78.
II. 5-8. 3-1994. 115-119.
III. 5-9. 4-1994. 150-152. 32

[illegible] 5 9. 4 1994. [illegible] 33

ఎస్. [illegible]. 5 11 6 1994. 230-236. 34

కే. [illegible] 6 [illegible] 1990 19 22. 35

[illegible] 4 [illegible] 6 [illegible] 23-26. 36

[illegible] 4 3. 10 [illegible] 28 32 37

[illegible] 2 29. 12 1991 21 38

శ్రీ [illegible] 2 32. 3 1992. 23 24. 40

[illegible] 5-12. 7 1994. 263 264. 41

[illegible] 5 7. 2 1994 72 75· 5 8 3 1994. 99 106. 42

[illegible] 5-12. 7-1994. 245-248. 43

[illegible] 5 11 6 1994. 227-229. 44

## 200 మత రంగం

అప్పుపుల్లి వెంకటేశ్వర రెడ్డి. భిన్నమతాలు సామరస్య సూత్రాలు. 4-6. 1-1993. 22 26. 45

అన్వేషి. దొంగగొడ్డ స్వర్గం. 2 19. 1 1991. 9 16. 46

మతాలను ఆధారం చేసుకోవడం నిక్ష్మప్రయోజనం. 2 18. 1 1991. 15 17. 47

టి. లపినంద్. అంబేద్కర్ రాసిన అరుదైన పీఠిక. 5 9. 4 1994. 123 128. 48

పాసుగంటి లక్ష్మీనరసింహారావు. సనాతన అధునాతన నాగరికతలు. 2 28. 11 1991. 16-19. 49

పి.వి. చౌదరి. మతం శాస్త్రం : సత్య శోధన. 2 26. 9 1991. 12 14. 50

బి.ఎస్.ఎల్. హనుమంతరావు. భారతదేశంలో కుల వ్యవస్థ: పుట్టుపూర్వోత్తరాలు. 5 12. 7-1994. 268 275. 51

శివలింగం. పురుషార్థాలు పుట్టుపూర్వోత్తరాలు. 5 7. 2-1994. 55 57. 52

సంజీవదేవ్. జన్ బౌద్ధం. 4 1. 8 1992. 3 12. 53

## 300 సామాజిక, రాజకీయ, న్యాయ, విద్యారంగాలు

ఆదివిష్ణు. అడం బాంబులు. 5 8. 3 1994. 112 113. 54

## 400 భాషా రంగం

అగేహానంద భారతి. శ్రుతి ప్రమాణాన్ని తిరస్కరించిన పునర్వికాసవాదం వాతనబద్ధ అందం, రమణీయకతలు. అను: వరూధిని. 2-32. 3-1992. 3-11. 83

కొండివర్తి శేషగిరిరావు. రసదృష్టిలో సౌందర్య సాంకేతిక పదాలు. 4-5. 12-1992. 11-14. 84

చీమకుర్తి శేషగిరిరావు. రసవివేచన. 3-34. 5-1992. 18-22;
3-35. 6-1992. 28-32. 85

—— రస వివేచన - కరుణ రసము. 4-3. 9-1992. 36-40. 86

—— రసవి వేచన - శృంగార రసము. 4-1. 7-1992. 34-40. 87

—— రసవి వేచన - హాస్య రసము. 4-2. 8-1992. 31-36. 88

భీమసేన్ నిర్మల్. కావ్యానందం-రసం. 2-31. 2-1992. 38-40. 89

—— రస స్వరూపం. 2-30. 1-1992. 25-27. 90

సంజీవదేవ్. కవిదృష్టి. 1-17. 12-1990. 2. 91

## 500-600 భౌతిక, జీవ, ఆరోగ్య రంగాలు

అట్లూరి వెంకటేశ్వరరావు. విజ్ఞానం-విజ్ఞత. 3-34. 5-1992. 14-17. 92

అన్వేషి. నపుంసకత్వం మానసికమా? శారీరకమా? 2-21. 4-1991. 21-23. 93

అర్ధనారీశ్వరుడు. లింగభేదాలు. 3-34. 5-1992. 22-24. 94

ఆలపాటి రవీంద్రనాథ్. మనిషిని కుంగదీసే మత్తు మందులు. 2-24. 7-1991. 14-18. 95

—— సత్యమా-సాపేక్షకమా. 3-34. 5-1992. 27-32. 96

ఎస్. ఇన్నయ్య. మూఢ నమ్మకాలు - ఆవు ఆయుర్వేదం. 2-20. 3-1991. 32. 97

—— ప్రకృతి పింఛం విప్పింది - సైన్సు దుర్భిణి వేసింది. 4-11. 6-1993. 15-22. 98

ఎస్.వి. బ్రహ్మం. జంతువునుంచి మనిషి, మనిషి నుంచి...? 3-36. 7-1992. 3-9. 99

ఎం. సౌభాగ్యవల్లి. అవయవాల మార్పిడులు-వింత ధోరణులు. 2-26. 9-1991. 20-22. 100

—— మాయదారి మధుమేహం. 2-22. 5-1991. 13-18. 101

కాకాని చక్రపాణి, డి. చంద్రశేఖర రెడ్డి. టావో-ఆధునిక భౌతిక శాస్త్రం. 4-2. 9-1992. 3-12 102

—— చర్మ సౌందర్యం కోసం. 1-13. 25-8-1990. 8-11. 103

టి. రవిచంద్. ప్రాచీన భౌతికశాస్త్రమును సులభతరం చేసిన దేవీప్రసాద్ చటోపాధ్యాయ. 4-12. 6-1993. 3-10. 104

## 700 కళా రంగం



## 800 సాహిత్యరంగం, (విమర్శ, ప్రేరణలు)

## 910 చరిత్ర–నాగరికత



## 920 జీవిత చరిత్రలు

## 921 తత్వవేత్తల జీవిత చరిత్రలు

అన్నపురెడ్డి వెంకటేశ్వరరెడ్డి. మేధావుల మెతకలు–జాన్‌పాల్ సార్త్రే. 2–19. 2–1991. 17–26. 174

— మేధావుల మెతకలు–బెర్ట్రాండ్ రసెల్. 2–20. 3–1991. 3–11.
గమనిక: దీనిపై విమర్శ పి.ఎ. చౌదరిగారి లేఖ చూడండి. 2–21. 4–1991. 15–20. 175

— సంక్షుభిత నైతికవాది మొరావియా. 1–16. 11–1990. 23–26. 176

ఎం. రాజగోపాలరావు. విస్మృతాంధ్రుడు ఆచార్య బుద్ధఘోషుడు. 5–7. 2.1994. 43–45. 177

ఎస్. ఇన్నయ్య. అంధకార యుగాల్లో వేగుచుక్కలు. ఆగస్టిన్ అన్సానానే (క్రైస్తవ తత్వవేత్తలు).
2–11. 2–1992. 3.10. 178

— తాత్విక త్రిమూర్తులు–సోక్రటీస్ - ప్లేటో– అరిస్టాటిల్. 2–30. 1–1992. 3.10. 179

— బ్రిటీషు ప్రాపంచిక అనుభవవాదులు జాన్‌లాక్. బర్కిలీ. హ్యూం తత్వాలు. 4–4. 11–1992. 44–48.
180

— మేధావిగా సంజీవదేవ్. 1–16. 11–1990. 27–32. 181

— మేధావుల ప్రవర్తన ఎలాగైనా ఉండొచ్చా? (బెర్‌హోల్డ్ బ్రెట్). 1–9. 26–6–1990. 3–6. 182

— 20వ శతాబ్దపు తత్తవేత్త బెర్ట్రాండ్ రస్సెల్ (1872–1970). 4–6. 1–1993. 27.32. 183

పి.ఎ. చౌదరి. సంపాదకునికి లేఖ. 2–21. 4–1991. 15–20.
గమనిక:- అన్నపురెడ్డి వెంకటేశ్వరరెడ్డి గారి వ్యాసంపై స్పందన. 184

బి. తిరుమలరావు. సూపర్‌మాన్ తత్వవేత్త నీషే. 4–10. 5–1993. 14–17. 185

— భౌతికవాద పితామహుడు చార్వాకుడు. 1–12. 10.8.1992. 15–16. 186

శిబ్ నారాయణ్ రే. మానవతావాది యం.ఎన్.రాయ్. 1–8. 10.6.1990. 3–8. 187

సంజీవదేవ్. జిడ్డు కృష్ణమూర్తి. ఒక రేఖాంకన. 2–21. 4–1991. 3–5. 188

— జిడ్డు కృష్ణమూర్తిలోని రసజీవి. 2–23. 6–1991. 3–11. 189

## 923 సాంఘిక. రాజకీయ. ఆర్థికశాస్త్రవేత్తలు

అన్నపురెడ్డి వెంకటేశ్వరరెడ్డి. మేధావుల మెతకలు– కారల్‌మార్క్స్. 2–18. 1–1991. 3–8. 190

— మేధావుల మెతకలు. రూసో. 2–24. 7–1991. 6–13. 191

అన్వేషి. ప్రవాస భారతీయుల దృష్టిలో స్వదేశీయులు. 1–15. 15.10.1990. 16–22.
గమనిక: విద్యాధర్ సూరజ్ ప్రసాద్ నయ్‌పాల్ అనుభవాలు. 192

## 927 కళాకారులు



## 928 సాహిత్య వేత్తలు

## II. వ్యాసకర్తల అనుక్రమణిక

## III. వ్యాసాల అనుక్రమణిక

## VI. కొందరు ప్రసిద్ధ చిత్రకారుల చిత్రాలు

## V. కొందరు ప్రసిద్ధులపై రేఖాచిత్రాలు. ఫొటోలు

# VI. A FEW ARTICLES IN ENGLISH

Delhi School of Scandals. 4–12. 6–1993. II,II covers.

Dying through eating the American way. 2–27. 10–1991. 33

Indian Professors of philosophy and their Myths... P.S. Sastry. 5–9. 4–1994. 135–137

Life after hell. 5–11. 6–1994. 32

Living Dictionary (Devil's Dictionary). From 2–10. 1–1992 onwards.

Mind – body revolution. 5–3. 10–1993.

Periodical with a difference. D. Anjaneyulu. 5–9. 4–1994. 148–149.

Price of popularity. 2–23. 6–1991. 33

Praise for Sonia. 2–28. 11–1991. II,III covers.

Rising graph of crime and sex. 2-25, 12-1991, 2.

SCAM is a four letter word. 5–1. 8–1993. 2

Strategies for smiles. 5–8. 3–1994. 106

How to age proof your mind. 5–7. 2–1994. 59.



Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH at Kala Jyothi Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 612436, 612337.

**Editorial NEST**

Plot No. 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad-500 033. Ph. 247717

# BRANCH OFFICES

**Synonyms for safe & pleasant places for your savings**

| | | Phone Nos. |
|---|---|---|
| 1 | Vidyanagar | 615192 |
| 2 | Malakpet | 528983 |
| 3 | Narayanaguda | 664909 |
| 4 | Vidyut Soudha | 220378 |
| 5 | Secunderabad | 76172 |
| 6 | Saidabad Colony | 877401 |
| 7 | Boudhanagar | 615518 |
| 8 | Himayatnagar | 232837 |
| 9 | Tarnaka | 869351 |
| 10 | Masab Tank | 225451 |
| 11 | Dilsukhnagar | 875539 |
| 12 | Charminar | 524161 |
| 13 | Baghlingampally | 668944 |
| 14 | Lothukunta | 845527 |
| 15 | Tarnaka Ext. Counter | 869308 |
| 16 | Tirupathi | 22428 |

RATES OF INTEREST ON

## DEPOSITS

| | |
|---|---|
| Current Account | — |
| Savings Account (w.e.f. 1-7-93) | 5.25% |
| **Term Deposits (w.e.f. 1-10-93)** | |
| 46 days o 179 days | 8% |
| 180 days to 364 days | 8.50% |
| One Year & above | 10.25% |

**NRE (Indian Rupee) Accounts**

(w.e.f. 12-10-93)

| | |
|---|---|
| Savings Account | 5% |
| **Term Deposits** | |
| 46 days to 270 days | 11% |
| 271 days to below 1 year | 10.50% |
| One year and above | 11% |




**The Andhra Pradesh State Co-op. Bank Ltd.**
(Scheduled Bank)
Troop Bazar, Hyderabad-500 001.
Phone. 44481-82-83.
Telex. 0425-6756, APCB-IN.
Fax: 0091-842-44978.

**APCOB: The Bank extending prompt & courteous service.**